# SREE CHIDVILASA BRAHMANANDABHYUDAYAM.

# శ్రీ చిద్విలాస బ్రహ్మానందాభ్యుదయము.



ఇది

తెనాలి హైస్కూలులో ప్రధానాంధ్రోపాధ్యాయుడగు,

శతావధాని

ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రిచే

రచితము.

PRINTED AT SEETHAVILASA PRESS,

TENALI.

 **1910.** Price 6 As.

 ఈగ్రంథము వలయువారు గ్రంథకర్తకే వ్రాసి తెప్పించుకొనవలెను.

శ్రీరస్తు.




# శ్రీ చిద్విలాస బ్రహ్మానందాభ్యుదయము

ఇది

శతావధాని

ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రిచే

రచియింపఁబడి

మ॥రా॥ శ్రీ వీరవల్లి అయ్యావార్లగారి ద్రవ్యసహాయమువలన

తెనాలి, సీతావిలాసముద్రాక్షరశాలయందు.

జేతపూడి జోగిసూర్యప్రకాశరావుగారిచే,

ముద్రింపఁబడియె.

మొదటికూర్పు

1000 ప్రతులు.

వెల రు 0-6-0. **1910** కాపీరైటు.

## శోధనపత్రము.



| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ii | 7 | కరము | కరణము |
| " | 22 | గణుడు | గుణుడు |
| 2 | 1 | నట్టిమా | నసతీమ |
| " | 8 | ణ్రాంక | ణాంక |
| 3 | 3 | సజ్ఞాలెశ | సద్జ్ఞానలేశ |
| " | 11 | పలుకుగువారు | పలుకువారు |
| 5 | 18 | శ్రగ్ధాను | శ్రద్దధాను |
| " | 21 | సుందము | సుందరము |
| 8 | 3 | దేవీ | దేవి |
| " | 17 | నెడ | విభునెడ |
| " | 23 | మెనిజ | నిజమై |
| 9 | 4 | కుండ-వేరు | కుండవేరు |
| 15 | 17 | మోముల | మోములు |
| " | " | యేమియు | యేనియు |
| " | 22 | కుంభనీ | కుంభినీ |
| 16 | 16 | సనం | ననం |
| " | 23 | స్థిర | చిర |
| 17 | 1 | రాజ్య | రాజ్యము |
| 18 | 1 | శుణ్ణలస | పాలుస |
| " | 2 | బ్రూన్చి | నుంచి |
| 19 | 16 | నిగ్గము | నిగ్గయము |
| 20 | 15 | నంతటె | నంతటి |
| " | 23 | ముద్దలో | తిత్తులో |
| 21 | 22 | తెవ | తన |
| 24 | 15 | జొంకి | బొంకి |
| " | 15 | స్థాపము | స్థాపనము |
| 33 | 15 | వివేకుడు | మహామోహుడు |
| " | 18 | విద్యలు | మిద్దెలు |
| 34 | 7 | యో | యోగిని |
| " | 10 | యించగ | యింపగ |
| " | 16 | దిక్కు | ధిక్కు |
| " | 23 | నువిద | కామినులగు నువిద |
| 35 | 14 | కారాకు | కారకు |
| 36 | 19 | గట్టిగ | గట్టంగ |
| 40 | 1 | బ్రాంతి | భ్రాంతి |
| " | 17 | చేతికిచ్చు | చేతికివచ్చు |
| " | 20 | యెణ్ణి | యెనిణ |
| 44 | 14 | మోహాకులమె | మోహకులు లె |
| " | 16 | భవుల | భవుని |
| 48 | 1 | తంబునగాంచి | తంబునుగొల్చి |
| " | 14 | పెట్టడు | పెట్టెడు |
| 49 | 6 | ముంకున్న | ముందకున్న |
| " | 9 | నిజేమే | నిజమే |
| 52 | 3 | ధన్యవై | ధన్యవైతి |
| 53 | 7 | డవె | డవై |
| " | 27 | డీందంగ | డిందంగ |
| 55 | 4 | యుండుట మూర్తిత్ర యుండవీవె | యగుటచే మూర్తిత్ర యుంబవీవె |
| 56 | 8 | జోవు | బోవు |
| 58 | 2 | జ్యోతి | జ్యోతి |
| " | 18 | దాయకు "ఏలనన" అనుచో | దాయకునకు "ఏలయనన" అని యుండవలయు |

శ్రీరస్తు.

# విజ్ఞాపనము.

ఆర్యులారా! నే నీగ్రంథమును వ్రాయుటకుఁ గారణ మితర వేదాంత గ్రంథములవలె శ్రావ్యముగ నుండుననియుఁగాదు. వానివలె వ్రాయఁగలవాఁడ ననియుఁగాదు. నేను కొన్నిరోజుల క్రిందట శ్రీకృష్ణమిశ్రవిరచితమగు ప్రబోధచంద్రోదయముం జదువుటచే వేదాంతవిషయమును గథారూపముగ వ్రాయవలయునను కోరికను మరల్పఁజాలక హరికథారూపముగా నున్నచోఁ బండిత పామరుల కనుకూలముగా నుండునని తలఁచి యిట్లు వ్రాసినాఁడ. కొందరి కిందలిపరమార్థము తెలియకున్నను బ్రస్తుత కథాంశ మెఱిఁగినచో దానిఁగూడఁ దెలియవచ్చునని నాయభిప్రాయము. వక్తలకు శ్రోతలకు నుత్సాహము గలిగించునని తలఁచి మంజరీ కీర్తనల నుంచితిని. ఈమంజరులకే తోహరలనియుఁ బేరు. మనోవృత్తులగు కామక్రోధాదులు కథాంశము లౌటచేఁ బేర్లు మార్చినచోఁ దెలసికొనుట కష్టము గాన వాడుకపేర్లనే యుంచితిని. ఇదియంతయు నద్వైతమతమున కనుకూలముగా నుండును గాన నాకుఁ గలిగిన యత్కించిదనుభవజ్ఞానముతోఁ గొన్ని మార్పులు చేసి కథ నిట్లు ముగించితి. హరికథగావున చిన్నదిగా నుండవలయునని యెంచి గ్రంథబాహుళ్యము లేకుండునట్లు మిగుల సులభముగా వ్రాసితి. కొన్ని స్థలములయందున నర్థసౌలభ్యంబునకై యథార్థానుస్వారాదుల వదలితిని. కీర్తనలుండుటచేఁ జేలవమనితలంపక దయాళులై గుణగ్రహణపారీణులు నన్నుమన్నించెదరుగాక యని ప్రార్థించుచున్నాఁడ.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,

శతావధాని ములుకుట్ల వేంకటకృష్ణశాస్త్రి.

శ్రీ ర స్తు.

శివాయగురవేనమః.

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా ।
తయోః స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగళం॥

శా॥ శ్రీరాముం డ్నిజదాసకార్యరచనా ♦ శీలుం డ్జగన్నాథు నా
త్మారాముం గరుణాపయోనిధి మదీ ♦ యగ్రంథముదాత్తపణా
ధారోదారున కయ్యవారికి సువు ♦ త్రశ్రీల నర్పించు న
ట్లారూఢిం గొనియాడి తెల్పెద తదీ ♦ యంబైన వంశావళిన్॥

ఉ॥ శ్రీకర లోక సర్జన ధు ♦ రీణ చతుర్ముఖ పాదసంభవ
ప్రాకటవంశమందు నను ♦ భాసిలు కమ్మకులంబునన్ గుణా
స్తోకుడు వీరవల్లికుల ♦ దుగ్ధపయోధిసుధాకరుండు సు
శ్రీకలితుండు ధాత్రి విల ♦ సిల్లెను వీరయనాఁ బ్రసిద్ధుడై॥

మ॥ విమలాత్ముండగు వీరయాఖ్యుడు మహా ♦ విశ్వాసశాంతాత్మన
త్యమలశ్రీకలితన్ సుధర్మమతి న ♦ త్యానందసంధాయినిన్
రమణాఖ్యాంగనఁ బెండ్లియాడి ఘనహ ♦ ర్షస్వాంతుఁడై నీతిస
త్తములందాతయ శేషయాఖ్యులమతిం♦దాఁగాంచెసత్పుత్రులన్॥

సీ॥ పండితో త్తములకా ♦ పాదింప హర్షంబు
మించి గృహాళిఁ గ ♦ ట్టించి యిచ్చె
నిసుమైనశ్రమనొంద ♦ నీక ఋణస్థుల
భవనంబులందు దీ ♦ పముల నిల్పె
లోపంబనుట కల ♦ లోనైన నను లేక
ధనము వేలకువేలు ♦ దాగణించె

దానధర్మములం దు ♦ దారగణాఢ్యుఁడై
వంశమునందున ♦ వన్నెకెక్కె-
గీ॥ సత్యవాక్యమునందుఁ బ్ర ♦ శస్తిఁ గాంచె
కనికరముగలవాఁడంచు ♦ ఘనత కెక్కె-
న్యాయవర్తనశీలుఁడై ♦ యలరుచుండె
శేషయాఖ్యుండు భాగ్య సం ♦ శ్లిష్టుఁడగుచు॥

గీ॥ జగతి కరమువంశాబ్ధి ♦ చంద్రుఁడైన
శంకరయ్యకు బుచ్చమ ♦ జలజముఖికి
నధికముద మావహిలఁజేయు ♦ నట్టిపుత్రి
వీరమాఖ్యను శేషయ ♦ పెండ్లి యాఁడె॥

సీ॥ పాలుపుమీరంగనే ♦ పాలఁతి బుట్టినయింట
శ్రీదేవి నాట్యంబు ♦ సేయుచుండు
ననవరతంబునే ♦ యతివ జొచ్చినయింట
భోగభాగ్యంబులు ♦ పొరలుచుండు
పరిగ నేననబోఁడి ♦ పాదంబు మోపిన
గోష్ఠంబు పశువృద్ధి ♦ గుదిరి యుండు
నెల్లచందంబుల ♦ నేభామిని యదృష్ట
శాలినియై సంత ♦ సమునునుండు
గీ॥ నట్టి వీరమాఖ్య ♦ యందు శేషయ్యకుఁ
బుట్టి రాత్మజలునుఁ ♦ బుత్రుఁడొకఁడు
జలధిమధ్యమందుఁ ♦ జంద్రుని కైవడి
నయ్యవారనంగ ♦ నమలగణుఁడు॥

క॥ ధనవంతుఁడు గుణవంతుఁడు
ననుపమ కేదారవంతుఁ ♦ డై యాశ్రితులౌ
జనులకుఁ దగు నుపకారము
లొనరించుచు నొప్పు నీతి ♦ యుక్తుం డగుచున్॥

గీ॥ మేనమామయు సుగుణన ♦ మేతుఁడైన
యట్టి కరణము చంచయ ♦ కాత్మజాత
యైన వెంకమ మఱియు ర ♦ త్నమ్మ యనఁగ
వెలయు నిర్వురఁ బత్నులఁ ♦ బెండ్లియాడె।

సీ॥ కట్టించె నేదయా ♦ కలితుండు పశుమర్త్య
పానార్థముగను కూ ♦ పంబు నొకటి
చేయించె నేజన ♦ శ్రేష్ఠుండు బహుభక్ష్య
తతి సంయుతాన్న సం ♦ తర్పణముల
నర్పించె నేసద్గు ♦ ణాఢ్యుండు సురవిప్ర
తతికి ధాత్రీ దయా ♦ దానములను
వహియించె నేశౌర్య ♦ వంతుండు వైభవా
కలితమౌ గ్రామాధి ♦ కారపదము
గీ॥ కోపమను మాట నెమ్మదిఁ ♦ గుదురనీక
నాస్తి యనుమాట నోట జ ♦ నంగనీక
నర్థులకు నర్థమొసగు నీ ♦ యయ్యవారు
వెలసె వెలయుచు నున్నాఁడు ♦ వెలయఁగలఁడు।

మ॥ ప్రకటానూనగుణక్రియాకలితుఁడై ♦ భాసిల్లు నీయయ్యవా
రికి దీర్ఘాయువు భోగసంపదమణి ♦ శ్రేణిన్ సుఖంబున్ సు
పుత్రకులం బౌత్రుల ధాన్య గోవిభవమ ♦ త్యంతప్రమోదంబుతో
నకలంకంబుగ నిచ్చి ప్రోవుత శివుం ♦ డాచంద్రతారార్కమున్॥





శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర గురు పరబ్రహ్మణే నమః.

# శ్రీ చిద్విలాస బ్రహ్మానందాభ్యుదయము.



శ్లో॥ యస్య స్మరణమాత్రేణ వాగ్విభూతి ర్విజృంభతే ।
మోహాంతరాయచ్ఛేత్తారం తం వందే శివ మద్వయం॥

శా॥ శ్రీమంతుండగు నాసదాశివు మదిన్ ♦ సేవించి కీర్తించి వి
ద్యామూలాత్మిక యాసరస్వతి సదా ♦ ధ్యానించి విఘ్నాచల
స్తోమేంద్రు న్గణనాయకున్ సుకవులన్ ♦ స్తోత్రంబు గావించి స
త్తామాత్రాత్ముల సద్గురూత్తముల నా ♦ త్మన్ గొల్తు మో
క్షార్థినై॥

సీ॥ వసుధ సన్నుతులుకాంచ్ల ♦ వంశాబ్ధిచంద్రుఁడౌ
చంద్రయామాత్యుండేద్వి ♦ జన్మదాత
శంకరాధిష్ఠిత ♦ శాంత మానసుఁడగు
శంకరశాస్త్రియే ♦ సరసుతంత్రి
అన్నపూర్ణా పూజ ♦ నాసక్తచిత్తయౌ
వేంకమాంబిక యేప ♦ విత్రుజనని
హితులగు నానంద ♦ నృహరి రామబ్రహ్మ
పూజ్య లేఖకుని ♦ పూర్వభవులు

గీ॥ పిచ్చమాంబ యనఁగఁ ♦ జెరొందినట్టిమా
తల్లి యేమహాత్ము ♦ ధర్మపత్ని
యాత్మ వేత్త యైన ♦ యట్టి కృష్ణబ్రహ్మ
శాస్త్రి యొప్పె మాకు ♦ జనకుఁ డగుచు॥

ఉ॥ శంకరభక్తుఁడై నగుణ ♦ శాలికి వాద్విజరాజమౌళికిన్
శంకరశాస్త్రినాఁ బ్రథమ ♦ నందనుఁడు ద్భవమందె నాత్మత
త్త్వాంకితభవ్యమానసుఁడు ♦ వ్యాకరణాదికళాప్రవర్తి యే
గ్రాంకసుకీర్తి దివ్యసుగు ♦ణాన్వితమూర్తియునై చెలంగుచున్॥

గీ॥ నేను రెండవకొమరుఁడ ♦ నిఖిలబుధవి
ధేయుఁడ మహాత్మభక్తుఁడ ♦ ధీరవిలస
దమలకారుణ్య పాత్రశ ♦ తావధాన
కరుఁడ వేంకటకృష్ణాఖ్యఁ ♦ బరగువాఁడ॥

క॥ మది గుసుగ సదానంద
ప్రదుఁడగు పరమేశుకగుణ ♦ బ్రహ్మానందా
భ్యుదయ మొనర్చి సదాశివ
పదముల కర్పించువాఁడ ♦ భక్తి దలిర్పన్॥

నాటకురంజిరాగము—రూపకతాళము.

కాలమహిమ యేమోయిదిగనుఁడీ ॥కాల॥ చాలశ్రమల బెట్టెడియీ।
సంసారంబున మునుగుచు । పోలరానిదుఃఖమ్ముల-బొందుచు నవిసుఖ
ములనుచు = లీలబట్టుపురుగు తంతు - జాలమ్మునయందు జిక్కు-
పోలిక దుష్కర్మంబుల - బొలియుచుంద్రు జను లయయో ॥కాల॥
ఉదయమునను నిదురలేచి - యుదరపోషణార్థులగుచు । పదపడి
తామెన్నెన్నియొ - పాటులబడుచు = తుద మొదలును లేని సకల

దుఃఖములను బొందుదురా। పరమును భజియించి నిత్య - సౌఖ్య
ము నొందగ జాలక ॥కాల॥

సీ॥ శాస్త్రముల్ నేర్చి స ♦ ద్జ్ఞానలేశము లేక
విద్యామదంబుచే ♦ వెలయువారు
దానధర్మము లేక ♦ ధనములనార్జించి
యుప్పొంగి గర్వించు ♦ చుండువారు
నధికారముల నొంది ♦ యంధబధిరులట్లు
కన్నుమిన్నెఱుఁగక ♦ యున్నవారు
చేయంగఁదగుఁదాని ♦ జేయక చేయంగఁ
దగనిదానినిజేయ ♦ దలచువారు

గీ॥ బహువిధమతంబులను గూర్చి ♦ పలుకరువారు
నేది యెట్టిదో తెలియక ♦ వెసఁగు వారు
తెలియఁదగుదానిఁ దెలియక ♦ తెఱలువారు
నహహ కలికాలమహిమ మే ♦ మనగఁ వచ్చు

వ॥ అనునట్లు కలికాల మిట్లున్నదిగదా. కావున నోహితులారా!
ఎల్లప్రాణులకును సుఖం బవశ్యంబకదా. అట్టిసుఖంబు మనకె
ట్లబ్బునో దానినే సంపాదింపవలయును. ఈజగంబున మనమొం
దుచున్న సుఖంబులు సుఖాభాసకంబులై విచారించినచో దుఃఖ
స్వరూపంబులగుఁగాని సుఖస్వరూపంబు లెంతమాత్రమునుగావు.
ఇంతియగాక మనముచూచుచుండువస్తువులెల్లను గొంతకాలము
లో నశించిపోవుటను మనము చూచుచునే యున్నాము. ఇట్లే
యఖిలజగంబును గూడ నశించెనని యూహింపవచ్చును. ఇం
దుకు "యద్దృశ్యంతన్నశ్యం" అనువాక్యమే ప్రమాణము. మ

టియు. మనము కోరునఖిలవస్తువులును రాకపూర్వము కొంత దుఃఖమును వచ్చినపిదప కాపాడుకొనుట కొంతదుఃఖమును అవి నశించినతరువాత మఱికొంతదుఃఖమును గలిగించుచున్నవి. కావున నిక్కసంసారమంతయు దుఃఖమయంబు గాని సుఖమయంబు గాదు. మఱియు మనమెట్టిదుఃఖములొందుచున్నను సుఖమునే కోరుచున్నారము. ఎందుచేతననగా. మనము జీవులముగదా. జీవులు పరమసుఖ స్వరూపుఁడగు పరమేశ్వరుని యంశముగుటచే సుఖమునే కోరుచుందురు. ఎట్లనఁ

మంజరి॥ మన్నునుండిన వ్యభూషాదికములు ♦ మన్నుగాక వేరగునే?
మున్నను భవమొందిన దానినిదా ♦ మునుకొని కోరకయున్నే?
పరునియంశమయినట్టిజీవుఁడా ♦ పరుఁడుగాక వేరగునే?
పరమసుఖానుభవుండై సుఖమే ♦ ర్పడుటను గోరకయున్నే?

అన్నిటికిని పల్లవి॥ బ్రహ్మానందబ్రహ్మానందం ♦ బ్రహ్మానందంబనుడీ
బ్రహ్మానందంబనియానుడీయా ♦ బ్రహ్మమమదిఁగనుఁగొనుడీ॥

వ॥ కావున నట్టిసుఖస్వరూపునకు సూర్యునకు మేఘమువలె నవిద్యావశంబువలన నచ్చిన జీవభ్రాంతి వదలినచో నతఁడు సుఖస్వరూపుఁడేయగును. అట్టిభ్రాంతి వదలుటకుఁ దత్త్వవిచారణయే మూలము. ఆతత్త్వము దెలియుటయే జ్ఞానయోగము. అట్టి యోగముచే జీవన్ముక్తి కలుగును. అట్టి ముక్తినిచ్చుట కీశ్వరుఁడే స్వతంత్రుఁడు ఇదియే సంసారమును తరించుట అందువలననే. శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచ॥ అని భగవద్వాక్య మిట్లున్నది మఱియు. తత్త్వవేత్త పరమేశ్వర స్వరూపుఁడగుననియు పరమపద మొందుననియు నట్టివాని కేప్రతిబంధకములునుండవనియు వేదాంతము లుద్ఘోషించుచున్నవి. వినుఁడు.

శ్లో॥ భిద్యతే హృదయగంధిః ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥ ఇత్యాద్యనేక ప్రమాణంబులు గలవు. ఇవియన్నియు ననుభవ సిద్ధంబులు. గావున మన ముక్తిము క్తిని జీవించియుండఁగాసంపాదింపవలెఁగాని, చచ్చి సంపాదించునది యెద్దియు లేదు. అందుకు మనుష్యజన్మమే ముఖ్యముగదా. ఎప్పుడో సాధింపవచ్చు నంటి రేని, దోసిటిలోఁ బోసికొనినజలమువలె మనయాయుర్దాయము క్రమక్రమముగాఁ బోవుచున్నది. మృత్యువాసన్నంబై యున్నది. కావున.

తోడిరాగము-ఆటతాళము.

రండీ-ఇదివి-నుండీ-ఉండెడివస్తువు నరయుడీ - యది - యుండెడిచోటేదో దరిఁయుఁడీ ॥ పండువెన్నెలకంటె బరమాహ్లాదము గనుగో - నుండీ - గైకో॥ నుండీ॥ ౧. పోని దెప్పటికిని బోవదు - మఱియుఁ - లేని దెప్పటికిని నిల్వదు॥ ఈనిజమంతెయుఁ - హితగురు బోధ గ-నుండీ- సుఖప॥ డుండీ॥ ౨.॥ వట్టిమేడిపండీ జగముగా - దీని - పొట్టవిచ్చితె పురుగులుండుగా। పట్టరానిసుఖము - దిట్టమై యుడుగాన- ంండీ- శివుగ॥ నుండీ॥

వ॥ కావున నట్టిపగతత్వస్వరూపంబును గథారూపంబుగఁదెలిపెదఁగాన శ్రద్ధధానులరై యాకర్ణింపుడు.

కథా ప్రారంభము.

మంజరి॥ శ్రీకరమై లోకాతీతంబై ♦ చెలఁగు సుషుమ్నా పురము
ఏకరూపమై పరమపదంబన ♦ నెసఁగు నధికసుందరము
అదిచూచినవారందుఁగలుఁగుసుఖ ♦ మంత యింతయనలేరు

సదమలమగుతత్పురిగనువా రీ - జగము జూడఁగా రారు॥

పల్లవి॥ బ్రహ్మానందం బ్రహ్మానందం - బ్రహ్మానందంబనుడీ
బ్రహ్మానందంబనియనుడీయా ♦ బ్రహ్మముమదిఁగనుఁగొనుడీ

గీ॥ నాశమనుమాటలేని యా ♦ నగరమందుఁ
జిద్విలాస మహాసౌధ ♦ శిఖరముననుఁ
నమల నిత్య స్వయంప్రకా ♦ శాత్ముఁ డగుచు
వెలయు శ్రీపరమేశ్వర ♦ విభుఁడొకండు॥

జంఝూటిరాగము-ఆదితాళము.

ఆపరమేశ్వరు - నలవియేపొగడఁగ - శ్రీపతికైనను - శేషన
కైన॥ నాపర॥ ౧. కేవలరూపుడు - భావాతీతుడు - పావనమానస -
భావ్యు డనన్యుడు॥ ౨.॥ భేదముగాంచడు - వాదములెంచడు - ఖేద
మోదముల - క్రీడజరింపడు॥

సీ॥ ఎవరేపనినిజేయ ♦ నెఱిఁగియుండునెగాని
తానేపనినిజేయఁ ♦ దారసిలఁడు
పరులు తామేమేమి ♦ పాడుఁలాడినగాని
కసరి తా నెవ్వనిఁ ♦ గదియఁబోఁడు
గుణవంతుఁడనితన్ను ♦ గూర్చిపల్కినఁగాని
తా నేగుణములలోఁ ♦ దగులుకొనఁడు
ఎవ్వారు తనజోలి ♦ నెత్తియాడినఁగాని
యెవ్వరిజోలి తా ♦ నెత్తఁబోఁడు

గీ॥ అతనిఁ బోలినయట్టివాఁ ♦ డతఁడెగాని
యన్యుఁడుగలండనుచుఁ బల్క ♦ నైనరాదు

ఎట్టివాఁడో కోయాపర ♦ మేశవిభుని
గాంచవలెఁగానివర్ణింపఁ ♦ గాఁ దరంబె ॥

సీ॥ తానేపనిని జేయ ♦ దలఁపకుండునెగాని
యందరిపనికిఁ దా ♦ నవసరంబు
నెవ్వారిజోలి దా ♦ నెత్తకుండునెగాని
యాతఁ డందరిజోలి ♦ కవసరంబు
నరయఁ దానెపుడు మా ♦ టాడకుండునెగాని
యందరుఁబల్కఁ దా ♦ నవసరంబు
నన్నపానములఁ దా ♦ నరయకుండునెగాని
యందరుఁ దినఁగఁ దా ♦ నవసరంబు

గీ॥ చూడఁజూడఁగ నేదియుఁ ♦ గాఁడుగాని
తలచిచూడఁగ నంతయుఁ ♦ దానెయగును
మిగిలియున్నాఁడు తాక్రిందు ♦ మీఁదులందు
నాత్మవేత్తలెఱుఁగుదు ♦ రతనిజాడ ॥

గీ॥ అరయ సుఖమునకా? పుట్టి ♦ నట్టియిల్లు
తెలివియా? తనసామ్మ్రుమి ♦ వెలితిలేదు
మృత్యువా? తన్నుఁజేరదిం ♦ కేమి కొఱత
పరమశాంతుఁ డతనిభజిం ♦ పంగవలదె॥

మంజరి॥ ఆపరమేశ్వరచక్రవర్తిభా ♦ ర్యామణి మాయ యనంగా
నాపరమేశ్వరశక్తిరూపమై ♦ యలరుఁ దానెపుడు. బాగా
పరమేశ్వరునకంటె వేరుగాదా ♦ ప్రభునకు నన్యములేమిక్
పరమేశ్వరుఁడునుగాను మాయయన ♦ బరగుచు
నుండునుగానక్ ॥

వ॥ ఆమె జలంబునమాధుర్యంబువలె, వాస్తవదశయందు నాపర మేశ్వరునికంటె వేరుగాక, వ్యవహారదశయందుమాత్రము వేరై యుండును. ఆమాయాదేవియం దొకచమత్కారంబు గలదదె ట్టిదన:

క॥ తనమాయఁ గననివారలఁ
దనమాయల ముంచుగాని ♦ తననెఱిగినచోఁ
ఘనసుఖమిడు నైనను ద
ద్ఘనితనిజంబెఱుఁగ రెంత ♦ వారలునైనన్॥

మఱియునొకచిత్రంబుగలదు॥

గీ॥ ప్రాణ మించుకయును లేని ♦ వట్టిమొద్దు
తెలివియొక్కింతయునులేని ♦ తెఱవ యయ్యుఁ
బ్రాణివిభుచెంతనుంటచేఁ ♦ బ్రౌఢయయ్యె
స్ఫురదయస్కాంతశిలచెంత ♦ సూదివగిది॥

వ॥ అట్లు వ్యావహారికదశయందుమాత్రము పరమేశ్వరునికంటె వేరుగానుండెడి సత్వరజస్తమోగుణాత్మకయగునామె శుద్ధసత్వ స్వరూపిణియై శుభ్రవర్ణమై మాయయనెడిపేరుతోఁ జంద్రునివె న్నెలవలె నెడబాయకుండును. ఇట్లుండి॥

మంజరి॥ అద్దముసందునఁ బ్రతిబింబించెడి ♦ యాదీపముచందమునన్
తద్దయు జ్యోతీరూపుండగుపతి ♦ తనలోఁ బ్రతిబింబింపన్
ఆపాపను దనలోఁ గైకొని తా ♦ నఖిలశక్తియుతయయ్యెన్
పాపయెట్టిదో యామెయెట్టిదో ♦ పండితులే గనవలయున్॥

గీ॥ పాపమాత్రమె స్వాధీన ♦ పరచుకొనెను
గాని కొనలేదతనిమెనిడ ♦ నరూపు

నాపరాత్పరుఁడును మాయ ♦ యందుఁ బ్రతిఫ
లించెనేగాని కలియఁగా ♦ లేము వేరు

హంసధ్వని--ఏకతాళము.

మాయ యేసుమా-మాయ జేయుపని ।మాయ॥ పాయకుండ - వేరుభావము గల్పించు। ౧ త్రాడుజూడ సర్ప - భ్రాంతి గల్గజేయు - మోడుజూడ దొంగ - పొందినట్లుజేయు। ౨॥ లేనిదాని నున్న - దాని గానుజూపు - పూనియున్నదాని - లేనియట్లుజూపు॥ ॥3॥ ఏకవస్తువున - నేకముగా జూపు - సోకుకష్టమును - సుఖముగజూపు॥

వ॥ ఇట్లుపరమేశ్వరునిపాపనుసంక్రమింపఁజేసికొనుటచే నామాయ సర్వశక్తిరూపమై లక్ష్మీపార్వత్యాదినామంబులఁగొని సర్వజగజ్జు నియమ్యే. మాయాప్రతిబింబితుండును సర్వజ్ఞుండై మాయయందుండినను తామరాకునుసీటివలె నామెనుగలయక మాయనువశపరచుకొని సర్వజగత్కారణుండును సర్వేశ్వరుండును నర్ధనారీశ్వరుండును నై బ్రహ్మవిష్ణ్వాదినామంబులచే వెలుంగుచుండు నంతట॥

మంజరి॥ అచ్చుటయిచ్చుట యనుభేదములే ♦ కంతటనిండెనుమాయ
యెచ్చటఁగలమాయను లోఁగొని విభు ♦ డెగసియుండు
సీచాయ

వ॥ పిమ్మట. యామాయ తనమాయాచమత్కారంబుజూపుటకై పరమేశ్వరునిబంధింపఁదలఁచి యాస్వచ్ఛరూపంబు చేసాధ్యుండుగాకుండుటంజేసి తనలో రెండవభాగమై మలినసత్వప్రధానమగు నవిద్యవలన ననేకభేదములుగలకళేబరపురంబుల నిర్మించి పరమేశ్వరు నందుబ్రతిబింబింపఁజేసి యాతని వేర్వేర వానియందుబం

ధించి జీవుండనుపేరుబెట్టి, యతనిభోగార్థమై కేవలజడంబగు తనతమోగుణంబుచే జగంబునుగల్పించి, తానీశ్వరునవలన మనోమహారాజనెడిపేరుగలపుత్రునింగని, యాపురంబుననుంచిన నాపుత్రుండు జీవసంబంధమువలనఁ బ్రకాశించుచు, తానే యాపురంబులకురాజై నివృత్తిసహితుండై జీవునకుసుఖకారకుండయ్యెను ప్రవృత్తిదుర్బోధలకులోనై జీవునకుభ్రాంతిగల్పించుచు దుఃఖకారకుండయ్యె॥

గీ॥ చిక్కులెన్నిఁటిఁగూర్చినఁ ♦ జెడక జీవుఁ
డాత్మతేజమొసగుచుండు ♦ నతనికెపుడు
కటకమైననుబంగారు ♦ కాంతిచెడక
కరమునకు నిజదీప్తిని ♦ గలుఁగఁజేయు॥

వ॥ ఆహా! మాయ యాపరమేశ్వరునెంతకుఁదెచ్చెనో చూచితిరా!॥

ఆరభిరాగము—ఆదితాళము.

నమ్మగాదునారీమణుల - నేవేళనైన - ॥నమ్మ॥ నమ్మదగని వినయమ్ముజూపి - నమ్మింతురు - విభు - నెమ్మనము విలాసమ్ముగలిపి - గలిగింతురు - వలపింతురు - వశులనుగావింతురు ॥నమ్మ॥ ॥౨॥ మంచిమాటలాడి పురుషులమదిగ్రహింతురు - కామించి రతులదేలించి యట్లెస్రుక్కింతురు - పగలెంతురు - చింతలదేలింతురు ॥నమ్మ॥ 3॥ తులువసేతలనధోగతులనుద్రోయింతురు «తమ" తలపులొక్కచో - వలపులొక్కచో - నుంతురు - యెంతైనసాహసింతురింతులెంతలో ॥నమ్మ॥

వ॥ అట్టిమనోమహారాజస్థితిగతులును తచ్చరిత్రంబు నిట్లువిచిత్రంబై వెలసె నెట్లన॥

మం॥కో॥ శ్రీకరవ్యాంబగు బ్రహ్మసృష్టిలోఁ ♦ జెలఁగుఁగ శేబరపురము
ఘూర్ణితరంబగు చిత్రరూపములఁ ♦ బొసఁగు నధికసుందరము
నంతరాంతరంబులుగా మూడై ♦ యల రెడు ప్రాకారములు
వింతవింతలగుపనులఁ జెలంగుచు ♦ వెలయు నవద్వారములు

గీ॥ చిన్నదియుఁ బెద్దదియును వి ♦ చిత్రతమము
నిత్యభంగురమును నవి ♦ నిర్మలంబు
నలరుఁ బరమేశ్వరాధీన ♦ మగుచు నెపుడు
ధరణిలోఁ దత్కళేబర ♦ పురవరంబు॥

గీ॥ ఆకళేబరపురమున ♦ కధిపుఁడు
మహితపరమేశవిభునకు ♦ మాయయను నెడు
నుగునయందు వొడమినకు ♦ మూగకుండు
భ్రాజితుండు మనోమహా ♦ రాజుదనరు॥

శంకరాభరణము-రూపకము.

ఏలుచుండును - ఆవిభుః ॥ఏలు॥ చాలగ - జాగరూకుడగుచు = లీలతోడజగములెల్ల - బాలుమాలికనుటలేక ॥ఏలు॥ ౨॥ ఆరుణు నితురగములకంటె - నతిశయమగు వేగంబున - హరిహరవిధిలోకం బుల = కరుగుచు - నొక నిమిషములో నరిమురిగా నేగుదెంచు ॥ఏలు॥ ౩॥ అతనియాజ్ఞకొక్కడయినవ్యతిరేకముగానడువడు - శత మఖునంతటివానికి = నతనిగెలువ వశముగాదు-మితములేనిశౌర్యశాలి॥

సీ॥ ఉపకారములు సేయ ♦ నపకారములు సేయ
నతనితోఁ బ్రతి యొకం ♦ డైన లేఁడు
ఆచారములసల్ప ♦ నాచారములదల్ప

నతనితోఁ బ్రతియొకం ♦ డైనలేడు
రక్షణంబొనరింప ♦ శిక్షణంబొనగింప
నతనితోఁ బ్రతియొకం ♦ డైనలేడు
దయబూనవారిలో ♦ దయలేనివారిలో
నతనితోఁ బ్రతియొకం ♦ డైనలేడు॥

గీ॥ ధైర్యవంతులలో మహా ♦ ధైర్యశాలి
పిటికివారలకెల్లనుఁ ♦ బెద్దవాఁడు
నతనికాతండెసరిగాని ♦ యన్యుఁడగునె
యీజగతి నామనోమహా ♦ రాజమణికి॥

మంజరి॥ ఇత్తెఱఁగున జగమేలెడియాదొర ♦ కిరువురుపత్నులుగలరు
సత్త్వములార ! నివృత్తిదేవియుఁ బ్ర ♦ వృత్తిదేవి యను
వారు॥

ఉ॥ అందు నివృత్తి యన్ సుదతి ♦ యాతనికి న్మొదలింటిభార్య స
ర్వేందుముఖిమతల్లి స్మరి ♦ యించినమాత్ర సమస్తబంధముల్
గ్రందఁగజేయుతల్లి బుధ ♦ రాజికి నాశములేనిశాశ్వతానంద
మహాపదంబిడు జ ♦ నస్తుతికల్పకవల్లి యారయన్॥

క॥ అతిసూక్ష్మదృష్టులను సం
తతశాంతులనెపుడు తనదు ♦ దర్శనమునశా
శ్వతసుఖులనుజేయును దు
ర్మతులను గనుఁగొనదు తాఁ బ ♦ రాకుననైనన్

మంజరి॥ ఆరమణీమణియందునఁ బుట్టెన ♦ దమలసద్గుణాకరుఁడు
వీఁడు విజ్ఞానస్వరూపుఁడు వి ♦ వేకమహారాడ్వరుఁడు
ఆవివేకజగతీశ్వరుఁడు మతీ ♦ దేవిని సతిగాఁగొనియెఁ

తా వస్తువిచారాదిమంత్రులతోఁ ♦ దిగ్గజగమేలు చూచుచుండె॥

వ॥ ఆవివేకమహారాజు ప్రభుత్వంబు సేయుచున్నయెడ—

సీ॥ సత్యవంతులు మహా ♦ సత్త్వసంపన్నులు
పరమార్థవిదులు క్రి ♦ పావనాత్ము
లాచారవంతులు ♦ నఖిలవిద్యాజ్ఞులు
నక్రోధనులు సహా ♦ సమాంగహితులు
నిష్కాములింద్రియ ♦ నిగ్రహదక్షులు
నిర్మోహులు సుతపో నియతమతులు
సంత్యక్తగర్వులు ♦ సర్వజ్ఞమూర్తులు
మహిత నిస్త్రైగుణ్య ♦ మార్గచరులు॥

గీ॥ దంభశూన్యులనావృత ♦ తత్త్వవిదులు
వీతరాగులు ద్వంద్వభా ♦ వాతిరిక్తు
లందరును బరిపూర్ణులై ♦ యలరుచుండు
రావివేకునిరాజ్యంబు ♦ నందుజనులు॥

వ॥ రెండవభార్యయగు ప్రవృత్తిదేవి—

ఉ॥ ఒక్కొకసారిఁ జూపుఁ బతి ♦ కున్నతలోకములందు సౌఖ్యమొ
క్కొక్కయెడం బ్రమోదము మ ♦ హోద్ధతిసల్పుచునుండు దుఃఖమొ
క్కొక్కొకవేళఁ గామరతి ♦ నొక్కతరిన్ విషయాభిలాషముం
గుఱిక్కుచు వశ్యఁ జేసికొని ♦ గుఱిమ్మరు సర్వగుణాభిరామయై॥

మఱియు.

సీ॥ తాఱిటినివైచి స ♦ ర్వంబుగాఁ జూపించు
నెవ్వఁ జెంపలుగొట్టి ♦ నవ్వఁ జేయు

మఱియుఁ గన్పడుఁదాని ♦ మటుమాయముగఁజేయు
తేనిది యున్నట్లు ♦ గానునన్ను
దుఃఖంబుఁగూర్చి సం ♦ తోషంబునఁగఁజేయు
లేకయే యుండిన ♦ లీలఁదోచు
లోలన్నై తనశక్తి ♦ లోకేతుంగఁగనీదు
కలియకయే యుప్డు ♦ కౌఁగిలించు

గీ॥ నేమిచెప్పను లోకమం ♦ దెవతెన్నైనఁ
జిత్రముల నామెకడ నభ్య ♦ సింపవలయు
ధరణిఁ గవులకుఁ గవుల తా ♦ తలకునైన
నామెమాయల వర్ణింప ♦ నలవియగునె॥

గీ॥ అత్తగారుమాయ ♦ యాకోడలికి మెచ్చి
తనదు మాయనెల్ల ♦ ధారవ్రాసి
తానభేదవృత్తి ♦ తోనుండు నెప్పుడు
నొకలు తననెఱుంగ ♦ కుండుపటుల॥

మంజరి॥ కలనైనఁ బ్రవృత్తినిఁబాయకయీ ♦ గతి మనోమహారాజు
నలర మహామోహుం డనుసుతుఁగనె ♦ సజ్జనాకృతిభాజు.
నాతనయునకు నిజార్జితరాజ్యం ♦ బఖిలంబును నర్పించి
యేతటి సతిసుతులను విడఁజాలం ♦ డెపుడా మాయలమించి,

సురటరాగము--ఆదితాళము.

కన్నులగనడాయెన్ ఎపు। డన్నరవిభుడు నివృత్తిదేవిని॥కన్ను॥
౨॥ జ్యేష్ఠభార్యగర్భంబునఁ బుట్టిన। శిష్టులగు వివేకాది తనయులను॥
3॥ తన్ను తుచ్ఛసుఖములలో దేల్చెడి చిన్నియాలి మాయ దెలియ
జాలక ।౪॥ చిన్నయాలిబిడ్డల స్వర్గంబుగ నెన్నుచు వారల సన్నల

మెలగుచు ॥౫॥ నిదానమునుండు-వారి నెఱిగిన-సదానందసా-మ్రాజ్యదా త్రియగు చెలి ॥గన్నుల॥

గీ॥ చండకరుఁ డొంకవిమవలి ♦ చందమున మ
నోవిభుండు మహామోహుఁ ♦ డా విపువక
ళానిచేష్టల కానంద ♦ భరితుఁడగుచుఁ
జెలిమితో యావరాజ్యాభి ♦ షిక్తుఁజేసె॥

వ॥ అంతమహామోహుండు తలిదండ్రుల క్షీణంబైన నెడబాయక రాజ్యాధికారదృప్తుండై కామ,క్రోధ,లోభ,మద,మాత్సర్యులను మంత్రులను రాజకార్యంబున నియోగించి పారుష్యుండును హింసయు తృష్ణయు దైన్యంబును అనృతుండును అసూయయు దంభుండును పైశున్యుండును చౌర్యుండును ఈర్ష్యయు పరిగ్రహుండును మొదలగు ననుచరులు కృతాంజలులై సేవింప నాస్తికతామహాదేవితోఁగూడి యజాతశత్రుండై రాజ్యంబు నలుపుచుండె నట్టియెడ.

శహాన--రూపకతాళము.

ఏమనదగునహహాయామ - హామోహునిరాజ్యగరిమ ॥యే॥ వేమోములగల యహిపతి-నేమియు బొగడంగలేఁడు ॥౧॥ జవదాటని మంత్రివరులు సఫలములగు సాధనములు- నవశూరులు యోధవరులు నవ్యనవ్య చమత్కారము ॥యేమన ॥౨॥ తమకుతామే తీర్పరులును తమకుతామే నేర్పరులును-తమకెదురనుమాటలేక తనరుబంధు పరివారము ॥యేమన॥

గీ॥ కుంభసీస్థ సకలజంతు ♦ కోటికడుపు
లోనఁ దనహారితో నిద్రఁ ♦ బూనుచుండు

వశుఁడు గాకుండఁ బ్రాఁచియె ♦ వ్వఁడుసుంగ
డతని రాజ్యకౌశలము నే ♦ మనఁగవచ్చు॥

చ॥ తనకతిపూజ్యుఁడున్ సవతి ♦ తల్లికిఁ బుత్రుఁడు ధర్మశాలి పా
వనగుణుఁడౌ వివేక నృ ♦ పాలునిఁ దానెనరించు రాజ్యమం
దునఁ బదమూనకుండ నతి ♦ దూరముగా వెడలంగఁ జేసెనా
జనపతి మంచివారి కగ ♦ చాల్లఁగు నీకలికాలమెట్టిదో॥

మంజరి॥ మహితవిభవములఁ గొలువుదీరి యు ♦ న్మహామోహుఁ డొకవేళన్
హిత మంత్రి పరిజనములతో నన ♦ హితముగా సుఖలీలన్॥

చక్రవాకము--ఆదితాళము.

మంత్రివరులారా వినుఁడీ॥ రాజ్య-తంత్రవిధంబు నిస్వతంత్రత నెఱిగింతు ॥మం॥ ॥౧॥ ఘనబుద్ధికుశలత-గలవారై శత్రు। జనములలో సం-జరుగు వృత్తాంతము। వినవలయున్-గని గొనవలయున్-అను-దినమును దమస్థితి-దెలుపదగ దెప్పుడు ॥౨॥ తగినమాటలతో మో-దము సల్పవలెగాని। పగరసేనలకుని-ల్పగనిసుమైనచోటి। య్యగిదగి కు-దే-ర్పగవగదు। మో-న్నగ గొంచెమిడిసనం-తయు నాక్రమింతురు ॥మం॥

వ॥ ఓహితులారా! నేను పట్టాభిషిక్తుఁడనయిన క్షణమునందే నా పితామహియగు మాయాదేవి నన్నొంటిగాఁ దనలోఁడకై నిడుకొని యొక పరమ రహస్యం బెఱిఁగించె వినుఁడు. అదియెట్టి యనిన, "వత్సా! మహామోహా! అంత యింత యని నుడువనలవిగాని సామ్రాజ్యంబు నార్జించి నీకొసంగిన మీతండ్రి యగు మనోమహారాజు నినువిడువక యెప్పుడును నీకువశుఁ డయ్యెనేని నీవును పరిజనంబులును స్థిరకాలజీవులయ్యెదరు.

నీతండ్రి యొకవేళవివేకునివంకఁజూచెనేని నీకురాజ్యనష్టమగుట యేగాక సూర్యదర్శనమాత్రంబున బంధురాంధకారంబుపగిది నీవంశమునశింపఁగలదు. కావున నీవు సమస్తోపాయంబులచే తను, నీతండ్రిని వివేకునికంటఁబడకుండునట్లు జేసికొమ్ము. అవివేకుండును తండ్రినివశపరచుకొనుటకై వేచియుండును. గాన నీవు నీమంత్రులును జాగ్రతగానుండుఁడు నీవుదీర్ఘాయుష్మంతుఁడవగుము" అనియానతిచ్చె గావున॥

సీ॥ అవివేకుఁడుమనరాజ్య ♦ మంతయునడుగు
మోహనిశాలాయనంబును ♦ బూనునట్లు
వలయునద్ధృత్యములఁజూప ♦ వలయుమీరు
ముందుమత్వరిపుఁడటయె సౌఖ్య ♦ మూలకంబు॥

మఱియునొక్కటి చెప్పెదవినుఁడు॥

మ॥ అవివేకుని ప్రభుత్వంబునఁగల ♦ యట్టిపద్ధతులనెల్లన్
మీరావిద్యాసైశిష్యంబోలయఁగ ♦ బెంచి యడంచుఁడుచాలన్
ధరణిలోన జరిగెడి వివేకునిమ ♦ తమునకు వ్యతిరేకముగా
మునియుచుమీరిరమ్యాడఁజనినునమతే ♦ మునస్థాపింపుఁడుబో గా॥

ఉ॥ మీరు సమస్త యత్నముల ♦ మేల్కొని యల్లవివేకుసైన్యమున్
జేరఁగనీక సింగములు ♦ జేరిగజంబులఁ జీల్చునట్లుగాఁ
బోరిజయించి మజ్జనకుఁ ♦ బూర్ణసుఖంబులఁదేల్చి సంతతో
దాగు వివేకుఁగాంచనివి ♦ ధంబుగఁ బన్నుఁడుపాయముల్ వడిన్

వ॥ అనినవిని వారలు బరమానందంబునొంది మహామోహునకు
కిట్లనిరి॥

మ॥ జగతీశా ! శిరసావహించి భవదా ♦ జ్ఞన్ సంతతంబున్ ఘనస్తో

జగతీశుల్ లస్తదింద్రియాశ్వగుల భా ♦ న్వస్తాఘసంకల్ప నం
స్థగితస్యందనమందుఁ బూన్చి విషయా ♦ స్థానంబులం జూపఁగా
దగఁ నాతండు వివేకునిం దలఁచునే ♦ తా వానిమాటాడునే ?

వ॥ కావున దేవా ! మేమికనరిగి మా ప్రజ్ఞావిశేషంబుచే నశేషజనంబులను మనమతమునవలంబింపఁజేసి వివేకాచారంబు నీటఁగలిపెదము. మాశక్తి నవలోకింతురుగాక. అని వెడలిన తదనంతరంబు॥

క॥ ఈకరణిమహామోహుఁడ
నేకశతాబ్దములురాజ్య ♦ మేలఁగిజ్ఞానా
స్తోకుఁడగువివేకుఁడుని
ద్రాకలనన్ మోహబద్ధుఁ ♦ డై వసియించెన్॥

వ॥ ఇట్లుండ నొక్కనాఁడు మహామోహుండు కుతూహలాయత్తచిత్తుండై తనసేనానాయకుండగు కలిపురుషుంగాంచి "ఓయీ మీమీకార్యంబులెట్లు జరుగుచున్నవి" యనవతఁడిట్లనియె॥
దేవా: వినుఁడు॥

సీ॥ జపతపస్స్వాధ్యాయ ♦ శౌచముఖ్యక్రియా
విధులెల్లనీటఁగ ♦ ల్పించినాను
ధనమబ్బునెడఁదప్పి ♦ తము లేదనుచుమాంస
విక్రయాదులనుగా ♦ వించినాను
అతిచిత్రమగువివా ♦ హంబులనొనగూర్చి
శ్రాద్ధముల్ నలదని ♦ సాటినాను
ఎల్లజాతులవారి ♦ నేకస్థలినిగూర్చి
విందారగింపఁగా ♦ వించినాను

తే॥ విగ్రహారాధనము విడి ♦ పించితలఁ

ఘోర్ర ఘోరంబులౌకకొంత ♦ గూర్చినాను
ధర్మశూన్యంబుఁగావించి ♦ తనిసినాను
ఘనమహామోహమాయను ♦ గ్రహమునలన॥

మహామోహుఁడు॥ కలిపురుషా ! మనమిప్పుడు ధర్మాధికారమునం దేర్పరచినయమునకుఁబనిసంపూర్ణముగానున్నదా ? చెప్పుము

కవి॥ మహారాజరాజా ! ఏమఁమనవిజేసెద. ఈయమునకొక్కనికిఁ బనిసాధ్యమగుటలేదు. దేవరవారు మఱియొకయమునింగూడ నియమింపవలయు॥

సీ॥ పాపంబులిన్నని ♦ పాటింపనేయిమొ
గంబులశేషుఁడౌఁ ♦ కక్కండనేమేటి
ఇనపముక్కలకాకు ♦ లెనసిచీల్చెడివారిఁ
గనిబ్రాయఁగసహస్ర ♦ కరుఁడేమేటి
నరకబాధలనొందు ♦ దురితాత్ములనెక్క
నారిజూచుటకుఁబా ♦ కారిమేటి
పుణ్యమార్గము చెంతఁ ♦ బోకపాపములని
గ్నముసేయఁగయము ♦ నాల్కమేటి॥

గీ॥ ఇన్నివేటికిఁగన్నొాస ♦ నిప్పుడింద్రుఁ
డేమిపనిలేకగురుఁజూచి ♦ యెందుఁబోత్తు
నేమియానతినిఁబట్టి ♦ యేడ్చుచుండె
ఘనమహామోహమాయను ♦ గ్రహమునలన॥

పీ॥ స్వామి ! యమునిబాధ యెట్లున్నను నతనిభార్యాపరితాపంబుఁ గనఁజాలకున్నాను॥

సీ॥ మగనితోమాటాడదగుఁ ♦ వీలుగానక

భటసంఘములు పైని ♦ మెటికవిఱుచు
మగనితోఁ బవళింపఁ ♦ దగువేళగానక
కరణాలనేవేళ ♦ గదసితిట్టు
మగనిఁగంటనుజూడఁ ♦ దగువేళగానక
జీవకోట్లనుజూచి ♦ చీదరించు
మగనితో విహరింపఁ ♦ దగమున్కై యుద్యోగ
భరము పైపటపట ♦ బంట్లఁగోలుకు॥

గీ॥ నిన్ని యేటికిశ్యామల ♦ యెడనుగుంది
కనమతినదుమనోరూఢిఁ ♦ గానమతినను
పుటుకపాపిష్ఠిదనుచు వా ♦ పోవుచుండె
ఘనమహామోహావిరాయను ♦ గ్రహముపలన॥

మం॥ బలే! బహుచమత్కారంబుగానున్నది. నీశక్తికి సంతసించితిని. తక్కినహరికార్యంబులెట్లున్నవి? అనినకాముండిట్లనియె

సావేరిరాగము—ఆదితాళము.

కౌశలమునుగనుమూ - నాశరి ॥కౌ॥ కౌశికునిసంతతివాని నిమేన - కాపదదాసుని గా నొనరించితి ॥కౌ॥ తలక్రిందుగఁబడితపములుసలిపిన - పలువేదాంతపు భాషలదెలిపిన - కలికినిగనుగొనిసంతసిజనుండు వి=కారమొందు సారమెందు డిందును ॥కౌ॥ కులముజెడిన కులగురువులుదిట్టిన వెలిబెట్టినఖై మనముబట్టిన - తలిరుఁబోడితనచెంతనున్నసుర=ధామముగను తామసమునసెంచును ॥కౌ॥ కనకున్నను గౌగిలింపకున్నను - కలసిమెలసిమాటాడకయున్నను - తనమదిలో జ్ఞాపకముగాగ చెలి=తపముగట్టి తాపముట్టి తిరుగును ॥కౌ॥

సీ॥ నెత్తురుముద్దలో ♦ నెలలకుచంబుల

బంగరుగిండ్లని ♦ పట్టించూచు
చొంగకుబావియూ ♦ యంగనపెదవిని
దొండపండనిపంటి ♦ తోడనొక్క
బోకెలపోగైన ♦ పొలంతుకమేనుబం
గారుతీంగెయటంచు ♦ గాంగిలించు
దుగంధమాంసమే ♦ దురతరావయవముల్
పావనంబనుచును ♦ పన్యసించు

గీ॥ వసుసవావులనన్నియు ♦ వదిలిపెట్టి
ఘనకులాచారవర్తనల్ ♦ గట్టిపెట్టి
గరితనురతంబెస్వర్గంబు ♦ గాంచలంచు
నన్మదీయశరావళు ♦ లంటజడుంచు॥

వ॥ దేవా నాబాణప్రయోగముచలననగు మఱియొకచిత్రమువినుండు॥

గీ॥ తమకులేకజనించిన ♦ తనయుండైనం
బూర్ణిమాచంద్రసుందర ♦ మూర్తియైన
సురతకాలంబునందునా ♦ నూనుండేద్వం
బండ్లుకొఱికితిట్టుదరు దం ♦ పతులువాని

వ॥ క్రోధుండిట్లనియె. దేవా ! నాచిత్రంబువినుండు॥

చ॥ గురులనుహుంకరించియటు ♦ గూలంగంద్రోక్కిసమస్తవస్తువుల్
బిరబిరడాయవచ్చిమెలి ♦ పెట్టుచుమీసముపైకిదూంకి గు
ఢ్లురిమి శిరంబునూపి యిది ♦ గోయికజూపెదనాదుపౌరుషం
బరయుమటంచుహింసకుర♦యంబునంబొల్పుదునేనుబూనంగనే॥

చ॥ తవధనమెల్లంబోయినను ♦ దబ్బరలెన్నియొమూడిపైన బం
ధనములగూలంద్రోసినను ♦ దాపముదీరకయార్చికొంచుందా

ననయముఁబండ్లగొఱుక్కుచును ♦ నాహుతిచాలనివహ్నిరీతినా
తనిఖిలనాశనంబయిన ♦ దాఁకఁద్యజింపఁడుగ్రోధవరాత్మలోకన్॥

వ॥ అంతలోభుఁడిట్లనియె॥ దేవా. సేనాక్రమించిన తోడనేమను
ష్యుఁడు॥

సీ॥ ఈదురుగాఁగడుపారఁ ♦ గూడుభుజింపఁడు
కన్నారనిద్దుర ♦ గాంచడెపుడు
పెద్దలుమాటాడఁ ♦ బెడచెవితోవినుఁ
గూర్చున్నచోమఱి ♦ గూరుచోనఁడు
అర్థలుకన్నుపడ్డ ♦ నటునిటుపోఁజూచుఁ
జిత్తంబునిలకడ ♦ సేయడెందు
దీర్ఘమాయూహకుఁ ♦ దెంపుసేయఁగలేఁడు
తనబాగుకోరులకే ♦ దంబుబెట్టు॥

గీ॥ నిన్నినేటికినేబూన ♦ నెన్నియున్న
వరుసబ్రహ్మాండకోటులు ♦ వచ్చిపడిన
నర్థమునకయిపాలిర ♦ లాడుచుండు
నిటులొనర్చితిదేవనే ♦ నెల్లవారి॥

మదుఁడు॥ దేవా నాచమత్కారమును వినుఁడు॥

గీ॥ కన్నులున్ననెదటివానిఁ ♦ గాంచనీను
చెప్పుమాటలఁజెవులలోఁ ♦ జేరనీను
నోరుపెద్దదియున్నను ♦ నుడువనీను
మదుఁడనగునేనుమనుజుని ♦ మార్కొనంగ॥

మాత్సర్యుండిట్లనియె॥ దేవా నాకౌశలంబు వినుఁడు॥

మంజరి॥ పగులులాభమొందుటగనికన్నులు ♦ వాయునట్లునేడిపించెదన్

పరులుసుఖపడుటగాంచినభోజన ♦ పానంబులవిడిపించెదక
పపట్లనుసితరులయున్నతదశ ♦ కీసడించుకొనఁజేసితిక
చూపోపమితనమనుబీజంబును ♦ సుష్ఠుగఁబ్రజమదినాటితిక॥

మహా॥ సవ్వ, వహ్వా ఎంతపని జేసితివి. మీరందరుసుదరే. మీచరిత్రంబులతివిచిత్రంబులు. ఇంకెవరేపనిని జేసిరి ?

అబద్ధుండిట్లనియె॥ దేవా నేఁజేసినపనివింటిరా ?

గీ॥ ఒకనియొద్దరతస ♦ మున్నఁజూడఁగగొని
నన్నునడుగవాఁడు ♦ నాకెబాఁకి
యిమ్మటంచురతన ♦ మెగవేసిదిగమ్రింగి
నమ్మునట్లుజేసి ♦ నానుసభను॥

దంభుండిట్లనియె॥

సీ॥ తినుటకులేకున్నఁ ♦ దీర్ఘైసమీసాల
సంపెంగనూనెఁబో ♦ సంగఁజేసి
నుదిభక్తిలేకున్న ♦ మంచిరుద్రాక్షతా
వళమమానముచఁద్రి ♦ ప్పంగఁజేసి
సంధ్యవార్వకయున్న ♦ సగసవిభూతిపిం
జెలగోచిధోవతుల్ ♦ గలుగఁజేసి
పొట్టలోనక్షరం ♦ బులులేకయున్నఁ దీ
ర్ఘులుదీర్పఁబండిత ♦ పుత్రుఁజేసిఁ॥

గీ॥ యెవ్వరేమంద్రోయనుభయం ♦ బింతలేక
పలువిధాలబడాయిలఁ ♦ బలుకఁజేసి
రాచకార్యాలబిరుదుల ♦ వైచికొంటి
దేవమిముఁగంటినాస్థితి ♦ దెలుపుకొంటి॥

గీ॥ పూజ్యుఁడనటంచుననునెల్ల ♦ భూమిపతులు
వెలయునాసనములపైని ♦ విష్టఁజేసి
చరణధూళిశిరంబున ♦ సంగ్రహించి
పొగడిరనిచెప్పుచుందునేఁ ♦ బూనజనుఁడ॥

వ॥ దేవా నేనాక్రమించినపురుషుండు తనభార్యతో నేకాంతంబుగఁ జెప్పుమాటలవింటిరా ? ॥

హిందుస్తానితోడి—ఆదితాళం.

మనకేమేయిక మనకేమేయిక - మనకేమేయో - మగువా కలవైన ॥మ॥ అబ్బాయిపెండ్లిలోన - నారువందలార్జించితి - సుబ్బయ్యకుబడాయిల్ జెప్పి డబ్బువందగాజేసితి ॥మ॥ ॥౧॥ భూతవైద్యం పేరుజెప్పి జోంకివందగాజేసితి - నాతనియింట్లోసాక్ష్యంజెప్పి వైదునందల్ గాజేసితి ॥మ॥ ॥౨॥ యాగముజేసినయపుడె యారువేల్ మిగిలించినాను - బాగుగాగూర్చితిడబ్బు బ్రహ్మసత్రంబెట్టినపుడె ॥మ॥ ॥౩॥ జాతకములువ్రాసికొంత సంగ్రహంబుజేసినాను - భూతిజూచియిడినడబ్బు భూస్థాపముజేసినాను ॥మ॥ ॥౪॥ మటిపటాటోపంబుజూచి నుంచిబ్రాహ్మణుడవన్నారు - గుటిమీఁగరుద్రాక్షల్ జూచి గురుమూర్తియనిపొగడినారు ॥మ॥ ॥౫॥ ధనంబుగూర్చుటకునేనెన్నో దంభములనువేసినాను - జనంబులకుబ్రహ్మవతారమని - మనంబునమ్మగజేసినాను ॥మ॥ ॥౬॥

అహంకారుండిట్లనియె॥ దేవా ! నాకువశుంపుగాని ప్రాణియొకండునులేఁడు నేనుసోకినమాత్రమునసనే ప్రతిజనుండు నిట్టుబల్కుచుందును॥

ఉ॥ పలుగుటిలోననన్ను నెళ ♦ బొసనమేఁల్ బిరుదొందినాను స

త్కులమునఁబుట్టిదాతయని ♦ గొప్పప్రసిద్ధినిగాంచినాను వి
ద్యలగసినాను మిత్రులను ♦ దారకులంగనినాఁడ నింకనా
వలెపరమోత్తముండవగు ♦ వాఁడవెనీవను రొమ్ముఁద్రట్టుచున్॥

పైశున్యుండిట్లనియె॥ మహారాజా! నేనుపాపంబనిగ్గానవెఱువక యె
న్నెన్నొపనులుజేసితిని అందుఁగొన్నివినుఁడు॥

సీ॥ అత్తకోడండ్రమ ♦ ధ్యనుకొండెముల్ సెప్పి
తరుగనిపోరు నే ♦ ర్పరచినాఁడ
తండ్రికొమరుల మ ♦ ధ్యనువాదములఁగూర్చి
ముఖబంధములఁబాపి ♦ మురిసినాఁడ
నాలుమగలకుమి ♦ ధ్యాలాపములఁబన్ని
సంసారభంగం బొ ♦ సంగినాఁడ
ప్రాణమిత్రులకుఁ దీ ♦ రనిపోరుఘటియించి
చిత్రచిత్రముల నీ ♦ క్షించినాఁడ॥

గీ॥ కలిగినంతభుజించి సు ♦ ఖంబుగాను
గూడుచొనసీకకొండెముల్ ♦ కోటిగూర్చి
యందుఁజీవాళ్లుదినిపించి ♦ యూవివేకు
మతముదొలగింపఁజేసితి ♦ క్షితితలేంద్ర॥

మహామోహుఁడు॥ శహబాస్. బలే. బలే. నాకోర్కెనంతయు దీ
ర్చితివి. దీర్ఘాయుష్మంతుఁడవగుము॥

వ॥ అప్పుడు చార్వాక కాపాలిక దిగంబర క్షపణక బౌద్ధ సోమసి
ద్ధాంతాదిమతనాయకులరుదెంచి దేవా! మేమావివేకునిపైనైనఁ
బ్రజలెరుంగకుండునట్లు, వానిమతభంగముజేయుటయేగాక మ
నమతమును స్థాపించుటకై చేసినయుపాయంబు లిన్నినిచెప్పఁజా

లము. అవిద్యాసంఖ్యాకంబులు పరస్పరభిన్నంబులు గావున సం
క్షేపంబుగాఁ జెప్పెదము. చిత్తగింపుఁడు॥

గీ॥ ఒకనిమాటనొకం డొప్ప ♦ కుండునటుల
పలువిధములగుమతములఁ ♦ బొదుకొలిపి
దేవునకండలుజీలంగఁ ♦ దీసినాము
తగవినేఁ నిరాకుండఁ ♦ దరిమినాము॥

వ॥ ఇంతయేల, మనోరాజ్యంబునఁగలవైభవమెంతైనఁగలదే? వినుఁడు

ఉ॥ రాముని రాజ్యమందునన ♦ రాతులబాధలుగల్గులోప ము
ద్దామయుధిష్ఠిరేంద్రునకుఁ ♦ దమ్ములుపాలికనట్టిలోపమో
భూమితలేశ్వరా! తమకు ♦ పూనినరాజ్యమునందులోపమ
ల్లేమియులేకమీమహిమ ♦ మెప్పుడుఁజెల్లురవిప్రభాఢ్యమై॥

వ॥ ఇట్లు సోత్ప్రేక్షంబుల నుగ్గడించుచు రాజ్యదృప్తులై యుండనం
తనక్కడ॥

ఉ॥ మోహనిబద్ధపాశములు ♦ బూనఁగమాయయుమచ్చుమందుఁబై
సాహసవృత్తిఁజల్లగను ♦ స్మారకమించుకయైనలేక తా
సాహసవంతుఁడయ్యునిలఁ ♦ జచ్చినకానిక్రియక వివేకుఁడే
యూహయులేకనిద్రగొని ♦ యుండెనుగర్మమునొంపశక్యమే॥

ఇట్లు బహుకాలంబరిగినపిమ్మట॥

మంజరి॥ వికటదీర్ఘతరనిద్రజెందినవి ♦ వేకునకాస్వప్నములోన
సుకృతుండనునొకసిద్ధుఁడుగన్పడి ♦ శుభవాక్యులనిట్లనియెన్॥

సురటరాగము--ఆదితాళము.

వివేకమహారాజా యికనిద్దురవిడిచివేగరమ్మా - చాలతడవా
యనులెమ్మా - మోహము నెడబాపుముపామ్మా ॥వివే॥ ॥౧॥ వికార

ములడంచిక్రమ్మఱగన్వయుం - ప్రకాశునకు బ్రకాశమునొసంగుము ॥౨॥ కమలహితుడులో కము మేలుకొలిపెడి - క్రమమునవాత్మని గనుగొనజేయుము ॥౩॥ విక్షేపావృతి విధమెడ బాపిన - నీక్షణమునవా త్ముడుదననెఱుగును॥

వ॥ ఇట్లు దెలుపనంతవివేకుండు నిద్రమేల్కాంచి స్వప్నంబున కచ్చెరువంది పాశంబులందివిచిచెదరిన బలంబుల సమకూర్చుకొని యొక్క యెడ తనభార్యయగు మతీదేవితో రహస్యంబుగా నిట్లనియె॥

భైరవి--రూపకము.

వినవే వనితామణి ॥విన॥ చెనటులునతిక్రూరులువారు-జేయుచున్న పాపకార్యము ॥౧॥ పరమేశుడు జగదీశుడు - పరుడుచిదానందమయుడు-పరమాత్ముడుకారణుడగు - ప్రభువిట్టులవెలుగుచుండ=పరగనహంకారాదులు - బట్టిపాశశతములచే - తరిమిబిగియగట్టిదీన-దశను జెందజేసిరయో ॥వినవే॥

వ॥ అట్టివారిదుర్వృత్తియు,మాతాతగారిదురవస్థయుఁగూడనామూలాగ్రంబుగాఁ దేటపరచెద, వినుము॥

గీ॥ కారణంబులకెల్లను ♦ గారణుండు
సకలతేజంబులకును దే ♦ జస్స్వరూపుఁ
డట్టిడిట్టిఁడననశక్య ♦ మైనవాఁడు
తన్మయుఁడుసుమ్మునాదు పి ♦ తామహుండు॥

గీ॥ కలఁడులేఁడనుటకుఁగూడఁ ♦ గారణుండు
కలఁడులేఁడనుమాటలు ♦ గానివాఁడు
రెండనెడిమాటయెపుడు లే ♦ కుండువాఁడు
తన్మయుఁడుసుమ్మునాదు పి ♦ తామహుండు॥

గీ॥ ఏదిబలుకుచునున్న నే ♦ దేదివిన్న
నేదలేదన్న నతనిచే ♦ నెఱుఁగవలయు
తెలియనాతనికిందు నే ♦ దియును లేదు
తన్మయుఁడుసుమ్ము నాదు పి ♦ తామహుండు॥

గీ॥ కాఁడుదేహేంద్రియముల హం ♦ కారచిత్త
బుద్ధిప్రాణంబులునుభూత ♦ ములునుగాఁడు
అన్నిటికిదూరమైసాక్షి ♦ యైనవాఁడు
తన్మయుఁడుసుమ్ము నాదు పి ♦ తామహుండు॥

చ॥ కనుఁగొనఁదీపితెజ్ఞలము ♦ కింటెనుపేరుగనుండకున్న వే
రనుచుఁబ్రసిద్ధినొందుగతి ♦ నాత్మనికంటెను భిన్నమైయచే
తన, జడమయ్యెవానివశ ♦ తఁబహుశక్తులగాంచునట్టియా
గుణనిధిమాయయాత్మనను ♦ గూర్చెనుబంధముజీవనామమున్॥

గీ॥ పాణిపాదంబులునులేవు ♦ పనులుసేయు
కన్నులునుశ్రోత్రములులేవు ♦ కనునువినును
చావుపుట్టుకలునులేవు ♦ చచ్చుఁబుట్టు
దేవుఁడయ్యునవిద్యచేఁ ♦ జీవుఁడగుచు॥

వ॥ మఱియు నాజీవుండు కామక్రోధాది సహవాసముచే నిట్లను
కొనుచున్నాఁడు॥

సీ॥ కొడుకులిద్దఱుఁబంచు ♦ కొనఁజాలదీభూమి
చెఱిపదియకరముల్ ♦ జేర్చవలయు
బలముగాలంచముల్ ♦ బట్టినాభార్యకు
బంగారుజడనేను ♦ పఱుపవలయు
పారిగింటిరుజమానుఁ బాఁదోలియాచోట

వీరునాపుత్రులు - వీరునాభ్రాతలని ॥౨॥ ఘనవిద్యనేర్చితి - ధనములా
ర్జించితి - నను చువహించు సహంకారంబుచే ॥3॥

కం॥ అనువృందమనఃకల్పన
కనుకూలునిజేసియాత్మ ♦ నామూరౌరా కా
మినియీాచందంబున బ
ద్ధునిజేసెస్వయంప్రకాశు ♦ దుష్టత్వమునన్॥

ఉత్సాహ॥ కాననామహాత్మ్మనిర్వి ♦ కారుఁబాశబంధముల్
పూనకధికసులభముగనః ♦ బోవునట్లుపాయముల్
మానసంబునందులేఁడు ♦ మనముపూనఁగావలెన్
బూనిదూదిమొగురఁగాలి ♦ పోల్కిఁప్రాణనాయకీ॥

వ॥ అనిపలికివివేకుండు బంధుమిత్రాదుల రావించివారితో నిట్లనియె॥

సీ॥ హితులారఘనబంధ ♦ తతులూడఁగాఁదీసి
జీవునిసుఖవంతుఁ ♦ జేయవలయు
దానికిమొదటిసా ♦ ధనముమనోవిభు
మనపక్షమునఁజేర్చు ♦ కొనఁగవలయు
జనకునిమనవైపు ♦ గననీనియామోహు
సకుటుంబముగనింకఁ ♦ జంపవలయు
వైరాగ్యుఁబంపిమ ♦ నోరాజుసరికట్టి
యొరుజోలినెత్తనీ ♦ కుండవలయు॥

గీ॥ శాంతిశ్రద్ధామలపని ప ♦ త్యాంతిఁదెచ్చి
కోరినాసంగమునుసకుఁ ♦ గూర్పవలయు
మతికదలకుండవలయుఁ దా ♦ మనసులేక
మాకపుడుబుట్టవలయుఁ గు ♦ మారుఁడొకఁడు॥

మ॥ సాంద్రానందాకృతినాబ్రహ్మ ♦ నందనందనుఁడుపుట్టి
ముందుగదర్శనకుఁడఁదనబంధ ♦ మ్ములసావలఁబోనెట్టి
యరయఁగబుద్ధ్యాదమంబురాశియుం ♦ దైక్యమైనగఁదోపఁగ
బరువడిజీవుఁడమాయకుఁడగునా ♦ పరమేశ్వరుఁడై యొప్పుఁగ॥

వ॥ మిత్రులారా! జీవుడుపరమేశ్వరునిలో నైక్యమగునపుడు మనకందరికిఁగూడఁబరమేశ్వరసాయుజ్యముగలుగును మహాత్ములకుపకారము సేయుట పరమధర్మము మనయర్థరాజ్యమునకై మహామోహునకు మనధర్మునిచేరాయబారమంపెద. మీరుమహామోహుని మదర్పోద్ధలవినకుండునట్లు హితబోధజేసి ప్రజలను మనకువశులనుగాఁజేయుఁడు అనిపల్కి- శాంతిశ్రద్ధావిష్ణుభక్తులను బోధార్థమంపి ధర్మునింబిలిచి ఓయీ! ధర్మా! నీవామహామోహునితో నిట్లుచెప్పుము॥

మంజరి॥ అన్నదమ్ములురణమ్మునఁజచ్చుట ♦ యపఖ్యాతియగునసుమీ
అన్నకునగపాలిశిరాజ్యమ్మున ♦ హాయిగాఁబ్రదుకుమనుము
ఒకనిసొత్తువేరొకఁడుహరించుట ♦ గొప్పదంబుగాదనుము
సకలవిధములవివేకుఁడునీకు ♦ కుశలముఁగోరినాడనుము॥

వ॥ ఇట్లుదెలిపి యొకయుత్తరంబుఁగూడ వ్రాసియిచ్చిన నాధర్ముండు దానింగొనిచని మహామోహుని సభాభవనంబున దర్శించి యుత్తరమొసంగ మహామోహుండిట్లు చదువఁదొడంగె॥

శ్రీరస్తు. శ్రీమదఖండబ్రహ్మాండమండలమండనాయమాన నవఖండమండిత మహీమండలాఖండలుండగు చిరంజీవి మహామోహునకు—భవదగ్రజుండగు వివేకమహారాజనేకాశీర్వచనంబులఁజేసి వ్రాయునుదంతము—ఉభయకుశలోపరి.

అస్మత్పిత్రార్జితంబగు రాజ్యంబునీ వనుభవించుటఁ గాంచి కన్నులార సంతసించితిని; నే నింతవరకును ప్రతీక్షస్వాధ్యాయములచే కాలంబు గడిపితిని; ఇప్పుడు మాకెందు వసించుటకు నాయర్ధరాజ్యంబు నాకొసంగుము. ఇవే యశేషాశీర్వచనములు. శ్రీ శ్రీ శ్రీ

మం॥ అనియుత్తరము నజదశమోహాస్త్రపుం డాగ్రహంబు చెలరేగఁగా
కనుఁగొనలను నిప్పులుప్రాలఁగ భట గణములతో నిట్లనియెన్॥

కం॥ ఏమిరా! వివేకుఁడు స్వ
త్సామర్థ్యమునెఱుఁగ లేక తా రాజ్యభరం
బేమో యేలెడునట యే
మేమీ! యీపిచ్చియూహ యేటికిఁ గలిగెన్॥

వ॥ ఔరా! ఈమాటలు గర్భనిర్భేదంబు చేయుచున్నవే! తాను తీర్థయాత్రలచేఁ గాలము గడిపెనట. ఇప్పుడు రాజ్యమేలఁదలచెనట. రాజ్యమాదిప్రాణాపకృష్టుఁడయ్యును రాజనామము వదలఁడయ్యె. ఆహా! ద్వాపరాంతంబువరకు రాజ్యంబు నేలినసంస్కారం బిట్లు పురిగొల్పుచున్నది కాఁబోలు. ఇంకన్నటికి నిట్టిపిచ్చియుత్తరంబుల వ్రాయక జాగ్రతగా బ్రతుకుమనుఁడు. అంతెమ్మియుఁగాక యీయుత్తరంబుఁ దెచ్చిన ధర్మ్ముని కారాగృహంబున నుంచుఁడు. అనియిట్లు చేయించిన కొంతకాలంబునకు, వివేకాలోచనం బెఱింగి శాంతిశ్రద్ధావిష్ణుభక్తులచెంత నిలువఁజాలక మహామోహుని వారావహులు తమరాజుతో నిట్లనిరి॥

కేదారగౌళరాగము—ఆదితాళము.

దేవా మామనవిని వినుమో ॥దేవా॥ ॥౧॥ ఈవేళ సుచిత్రమొకటిబుట్టెను - కానఁగదవె మమ్ము భయముదీరిచి - యీవివేకుఁడు మన

శౌరిలక్ష్మీకలంకృతి ♦ సలుపుచుండు
నింద్రియోపశమముగల్గు ♦ బుల్లారులకు॥

వ॥ కావున శాంతకిభయంపడవలదు, విష్ణుభక్తితోఁగలియుటచే సాత్వికశ్రద్ధబహుసమర్థురాలని తోఁచుచున్నది, ఇప్పుడొకయుపాయముచే వారుముగ్వురును మడియఁగలరు, వినుఁడు॥

మంజరి॥ చతురసాత్త్వికశ్రద్ధనుగ్గెకొన ♦ శాంతిదిగులునఁగృశించుచున్
అతులితమైనసఖీవిరహముచే ♦ నాయోగనియునశించుచున్
అందుచేతఁదొంశమువిరిగినగజ ♦ మట్లువిశ్వేశుఁడుదాను
గుందుచురాజ్యంబునపాలిమ్మని ♦ కోఁగకయత్నముమాను
ఆశ్రద్ధనుహరియించగమనమి ♦ థ్యాదృష్టియెబలుజాణ
విశ్రాంతినిగోరదునాస్తికతా ♦ బిరుదొందినస్త్రీరాణి॥

వ॥ అంత॥

జంఝూటిరాగము—జాల్ప తాళము.

నాస్తికత వచ్చెనంత నాథుజేరగ ॥తన॥ నాస్తికసౌందర్యమెంతో-నయముమీరఁగ ॥నాస్తి॥ ॥౧॥ ఇటునటుజూచి-యటునిటుజూచి-యెక్కిరించుచు ? ఎక్కిరించుచు - బలు - దిక్కరించుచు ॥నాస్తి॥ ॥౨॥ మటిమటినగుచు - బిలబిలజనుచు - కొలకొలలాడుచు - కొలకొలలాడుచు - విభు నటిముటివేడుచు ॥నాస్తి॥

వ॥ ఇట్లువచ్చుచున్నయామెనుజూచి మహామోహుండు దేవి నీవిలా సంభాశ్చర్యంబుగానున్నది, నీకన్నులెర్రబడగానుండు టేలనో ? చెప్పుము॥

నాస్తికత॥ దేవా ! నాకునిద్రవచ్చుచున్నది, ఏలనన, ఒకమగనితో సంసారంబొనర్చునువిదలకుసహితము తెల్లవారులు నిద్ర

లేక కునికిపాట్లువచ్చుచుందును, నాకో కామునకు, క్రోధునకు. లోభుడు, ఆప్పై నిమీరునమగలే, ఇంతయేల, మనకులములో నాకుమగనికాని వాఁడెవఁడు ? గర్భస్థజరాయు పిండముకూఁడ నాకుచిన్న ముద్దులమగఁడు, ఈపెద్దదయ్యములు నాచిన్న భూతములుగూఁడనన్నెప్పుడుబ్రతుకనీయవు, తమరురమ్మన్నప్పుడు రాకుంటె మీకుఁగోపము ఈనిద్రకెట్లోర్చెద, అని మహామోహునికౌఁగిలించుకొని నతండిట్లనియె॥

మ॥ వహావానీవిటుకౌఁగిలించుటను నా ♦ వార్ధక్యమీవేళఁదా నహాహా ? వెన్కనువచ్చెనింద్రియముల ♦ త్యానందముంబొందెనం గ్రహరూపుండగుమన్మథుండుబికి మే ♦ రక్షమీరియాటాడెనో మహనీయుంబగుక్రొత్తయవ్వనము స ♦ న్మానించితోకోమలీ॥

వ॥ ఇట్లుపలికి॥ దేవీ ! వినుము, మనశత్రుకోటిలోనుండు నాశ్రద్ధాపిశాచియిప్పుడు మనరాజ్యభంగమునకు కారాకురాలుగానున్నది, దానింబట్టి యీడ్చుకొనిరాఁగలవా ?

నాస్తికత॥ మహాప్రభూ ! మహాప్రసాదము, వాములఁదినెడిస్వాములకుఁ బచ్చిగడ్డి ఫలాహారమా, అనునట్లు నాకాపెయెంత? వివేకునినైనను దేఁగలను॥

మహామోహుఁడు॥ దేవీ ! ఎట్టిమాయోపాయంబులచే నాపెనుదెచ్చెదవో చెప్పుము ? ॥

నాస్తి॥ దేవా వినుఁడు. ఆశ్రద్ధలోకులచెంతఁజేరి మోక్షమున్నదనియు, యజ్ఞాదులఁజేయవలయుననియు, శాస్త్రపురాణాదులు ప్రమాణంబులనియు, నేమేమోబోధించుచుండును. అట్టి

యామెడ గట్టితెచ్చి యూపుమాపెదను. మఱియు నామెమా
టలనమ్మకుండుటకు లోకులకునేనుజేసెడి బోధవినుండు॥

సీ॥ ధర్మశాస్త్రోక్తమా ♦ ధర్మముల్ దబ్బర
మోక్షంబనెడిమాట ♦ మొదలెలేదు
శ్రుతిమార్గమసత్యె స ♦ మృతిజేయజాలదు
సౌఖ్యముంజెలుప శాస్త్రములుబుట్టి
జన్మంబులనుజేయ ♦ స్వర్గంబనుటనున్న
నయమార్గమునను బు ♦ ణ్యముహుళక్కి
సాయుజ్యమనుమాట ♦ సర్వశూన్యమ్ము న
దాచారమునశుద్ధిం ♦ డనుటకల్ల॥

గీ॥ యన్నియునునట్టివేయని ♦ యరసితెల్పి
నాత్మసంగొట్టిశ్రద్ధను ♦ నేనుతెచ్చి
గమణమీపదయుగదాసు ♦ రాలింజేతు
విష్ణుభక్తినయినంగాని ♦ వెలుపులేక॥

వ॥ ఇట్లుపలికి యానాస్తికతయుత ఘోరరూపంబున వెడలి సమయం
బునేచి॥

మంజరి॥ అపుడుసాత్వికశ్రద్ధనుగైకొని ♦ యానాస్తికతాదేవి
కపటంబునబిగియంగంగట్టి రొప్పుచు ♦ గదలనీక బల్ కివి
కనులదలమ్ములుకాల్వలుగట్టగ ♦ గాసిలియేడ్చుచునుండగ
కనులుమూసియతివేగముతో నా ♦ కాశంబునంగొనిపోవగ
అతిశాంతంబునవిష్ణుభక్తిమి ♦ ధ్యాదృష్టినివరుషుంగగ
క్షితింద్రాశ్రద్ధనుబొంతైచియుల్ ♦ జేరెనుబ్రాణముతోడగ॥

వ॥ అంతనావిష్ణుభక్తి మహాదేవియాశ్రద్ధనుగైకొనివచ్చి జనువుదీర్చి

కామాది వంతగుందుశాంతికి ధైర్యంబుఁగఱపి శ్రద్ధతో నిట్లనియె॥

కం॥ తులువమహామోహుని సే
నలగెలువుమటంచుఁజెప్పి ♦ నామాటగ నీ
పలుకకనగాండ్లం దెలువుము
చెలువముగవివేకుచెంతఁ ♦ జేరుము శ్రద్ధా॥

వ॥ అని తెలిపి విష్ణుభక్తి పంపగా నాశ్రద్ధవివేకునింజేరి సమస్కరించి యిట్లనియె॥

నీలాంబరిరాగము--ఆటతాళము.

మనవివినుమా - మక్తిదయగనుమా ॥మనవి॥ ॥౧॥ దినకరతే
జమా దినమువరకు బ్రతికి - కనుగొంటిమఱలమి - మ్మానఘచారిత్రా
॥౨॥ కడుకష్టయానాస్తి - కతనన్నబెట్టిన - కడగాంక్షిన్నని తెల్ప -
గానేరధీరా ॥మనవి॥ ॥౩॥ వెనుకగావచ్చినా కనులుమూసితన్ను - కొ
నిపోయెచంకన గొనిభూమిగమనా ॥౪॥ అపుడువిష్ణుభక్తి యార్తనా
దమువిని - కృపచేసన్వేషిపించి-గీటనచెదాని ॥మనవి॥ ॥౫॥ తెప్పరిం
చుకొని-యప్పుడానాస్తికత-తప్పించుకొనిపోయె-తనరాజుకడకు ॥మన॥

వ॥ దేవా, ఆవిష్ణుభక్తి యెల్లెట్లో నాప్రాణములునిలిపి, తమసన్నిధానంబునకుఁ బంపినది, ఇకనాలస్యము చేయక మహామోహాదులఁ దెగటార్పవలయునని తమతోఁజెప్పుమని యాజ్ఞయిచ్చెను.

కం॥ అనియిటులశ్రద్ధ దెలిపిన
వినియచ్చెరువంది యావి ♦ వేకుఁడు వేగన్
దనపరిజనములతో ని
ట్లనియెన్ నయయుక్తిసంగ ♦ తాలాపములన్॥

వ॥ వింటిరే? అద్దురాత్ముండు మనమంపిన ధర్ముని బంధించుటయే

గాక శ్రద్ధనుగూడఁ జంపింప యత్నించెఁగదా ! ఇంతియేగాక॥

మంజరి॥ జనకునితమునృశమ్ముగఁ గైకొనిమముఁ ♦ గనవీఁకుండటవలనన్
మునకు నిలుచుటకుఁ జోరహీయక యా ♦ త్మసుశ్రమనలిపినఁ దనన్
పరుని బాధనా పుట్టకు జగతిమన ♦ పాల్గొనుటకునీ వేళన్
మతినాగలఁ దెగటార్పవలయు ని ♦ మ్మహి న్నృపధర్మము గానన్॥

గీ॥ కౌరవుల నెల్లఁ జంపి సం ♦ గ్రామమునను
వసుధ నేలంగ లే దెయా ♦ పాండుసుతులు
బంధువులఁ జంపఁ జను లెల్లఁ ♦ బాపమని రె
పాటితగ్గనె నరకకూ ♦ పమునఁ బడి రె॥

వ॥ అనిపలికి ముఖ్యమంత్రియు ననుపమాన సకలవిద్యావిలాసుండును, సమస్తవస్తుగతి గుణదోషవిచారణా కుశాగ్రబుద్ధియునగు వస్తువిచారునితో నిట్లనియె॥

తోడిరాగము-రూపకము.

ఓవస్తువిచారా వినుమిది ॥ఓవస్తు॥ ॥౧॥ ధీవరమణిమనము రిపుల - నీవేళ నుపాధించెడి-యావిలువును-నీవు దెల్పు ॥ఓవస్తు॥ ॥౨॥ అతిబలుడు మహామోహుడు - నతనివశులు సర్వజనులు - ప్రతినమించిన యోధవరులు - క్షితినెల్లను - మతిగలచెను - ధృతిమించెను నేటులగెలుత ॥ఓవస్తు॥

వ॥ అనిన వస్తువిచారుండిట్లనియె. దేవా ! మనకిప్పుడు శత్రువధ యవశ్యకర్తవ్యంబు. విష్ణుభక్తి మహాదేవియు, మనకీపనియే గూనతిచ్చినదిగదా, వారివారికి, మనవారికింగల బలపౌరుషంబులు గూడ నుడివెదవినుఁడు. వారిలో నతిరథులగు క్రోధ, మద, మత్సర, పారుష్యలను శమన క్షమాదేవి జయింపనోపును, మహా

రథుండగు లోభుని మన సంతోషుఁడు దెగటార్చును. అతిరథ శ్రేష్ఠుఁడగు మహామోహుని దమరును, అర్ధరథుండయ్యును న తిమాయికుండగు కాముని సేనను గెలువవలయును. అందరో కరయెత్తు కాముండొకయెత్తు. అట్లు గెలుచుట దుస్తరమైనను మ నయిలువేల్పగు విష్ణుభక్తి మహాప్రసాదముచే మనకార్యము గ ట్టెక్కఁగలదు. కాముని చాకచక్యము వినుఁడు॥

కం॥ చందురుఁడుందీగెలును మి
 ళిందంబులు చల్లగాలి ♦ లీలావనముల్
 సుందరమగునెలవులు పూ
 ర్ణేందుముఖులచూపుబాణ ♦ మేమనవచ్చున్॥

మఱియు॥

గీ॥ ధనువుచెఱుకుతుంటె ♦ తగుతుమ్మెదలునారి
 పూశరములుచంద్ర ♦ ముండునేస్త
 తనకుమేనులేద ♦ తఁడుగెల్చుజగముల
 నెట్టివాఁడుగెల్చు ♦ నట్టివాని॥

వ॥ వానినొకయుపాయముచే గెలువవలెను. వానికి స్త్రీలే ప్రధా నాస్త్రములు, ఆబాణములఁ దప్పించుకొనిన చోనతని సులభము గా గెలువందగుగాన నతండాశ్రయించిన పురుషులకు నేనిట్లుబో ధించెదను. ఓరీ పురుషుఁడా వినుము॥

మంజరి॥ నెత్తురుగుంటలుమాంసపుదిబ్బలు ♦ నెలతుకబోకెలప్రోవు
 నిత్తెముదుర్గంధపునడుపీనుఁగు ♦ నీకసహ్యమగుతోవు
 నీలోనతిలోనున్నదియొక్కటె ♦ నిర్మలమగుజ్ఞానమ్ము
 చాలఁగనీవేయదియనియెఱిగిన ♦ సందేహమ్ములజిమ్ము

అనుచువిచారణగలుపినెలతపై ♦ యాభ్రాంతినిసడలించి
మనసిజుండగుకాముని బరిమార్చెద ♦ మహితబోధ దేలించి॥

వ॥ అనివిని క్షమాదేవి యిట్లనియె॥

పూరికళ్యాణి--రూపకము.

క్రోధమునదనుడంతుగా - ఆ - క్రోధమునడలింతుగా - సాధుజను లనక్రియలను - బాధించెడిపలుగాకిని ॥క్రోధ॥ ॥౧॥ మఱికనుబొమముడిబెట్టగ . చిఱునగవునుజూపింతును - దరికొనికొట్టుటకురాగ దాసోహంరక్షయనుచు ॥క్రో॥ ॥౨॥ కఱుకుకత్తి వెఱుకననుగ్రహపాత్రుడనని దెలిపెద-చెఱుపులిట్టిట్టిగనా-శీర్వాదంబనిపగడెద ॥క్రో॥

గీ॥ మానవారుష్యహింసలు ♦ మత్సరుండును
క్రోధమునుంచి క్షణములో ♦ గూలిచెదము
రవనిజాతంబునఱికిన ♦ యపుడెసకల
శాఖలును వాడిపోడుమైన ♦ చందముననుఁ॥

వ॥ సంతోషుండిట్లనియె - దేవా, నేనాలోభుని జయించుటకై లోభావిష్టునకుఁజేయు నుపదేశంబు వినుఁడు॥

శా॥ ధీదార్ఢ్యంబునుబూనరా కలిగినం ♦ తేచాలురా నీవిపో
లేదా ? చేఁకిచ్చునధనములుజా ♦ లిందేల్చి, వద్దన్నరా
లేదా ? యప్పుడునీకుగొప్పతనమా ? ♦ లీలంజనంబట్టఁగా
రాదా ? శత్రుఁడవౌదె ? యన్నిటినిగ ♦ ర్మంబేయిడుంగాననా
శాధర్మంబెడలింపుముున్నదియొకని ♦ సంతుష్టునింజేయురా॥

సీ॥ చాలునీపొట్టకే ♦ వేళనీయన్నంబు
చాలఁగాబ్రతుకగో ♦ పాలుఁడిదును
కొల్లగానార్జించి ♦ యెల్లవారలుధనం

బెల్లఁగొంబోవంగ ♦ సెఱిఁగినారె
బొంగియుండెడిదాఁక ♦ డిందువారఁగనీక
మూఁడేయుసఁగుఁగగ్రు ♦ మొందుఁజనిన
స్వప్నంబుగాఁర్చుట ♦ కష్టంబుదార్చుట
కష్టంబుదాపనీ ♦ కష్టమేల॥

గీ॥ కోరకున్ననురానున్నఁ ♦ గూడివచ్చు
బోవనుండినదాఁచిన ♦ బోనెబోవు
నటుచునెఱిఁగిప్రమోదంబు ♦ నందుమోరి
యాశవిడువుముగోరిసౌ ♦ ఖ్యంబుదారి॥

సీ॥ మిత్రిబెబ్బులినీదు ♦ మెదడువిందొనరింపఁ
గారాడుచున్నది ♦ కదలనీదు
కదియవచ్చెనుబెద్ద ♦ ముదిమిముసలినోరు
తెఱచిహాలమ్మనియొక్క ♦ పరిగ్రమింగు
నిత్తెంబుదరిజేరి ♦ నెఱిపిల్లజలగల
గుంపునెత్తురుదీసి ♦ క్రుమ్మచుండె
చెంగలించితినేని ♦ దొంగబుద్దినీరు
లోతెఱుఁగఁగనీక ♦ ముంచివేయు॥

గీ॥ పుడమిఁబేరాసగుంటలోఁ ♦ బడితిపిచ్చ
విడిచియిలుజేరిహారునంబు ♦ వడయకుంక
నేలఁదడసెదవిందుని ♦ గ్లోదులాడు
దుడుకుతనమునుమానవా ♦ దున్నపోత॥

వ॥ మఱియు నిట్టిభాగవతోక్తియుం గూడ బోధించెద॥

సీ॥ కమనీయభూమి భా ♦ గములులేకున్నవే ?

పడియుండుటకుదూది ♦ పరుపులేల
సహజంబులగుకరాం ♦ జలులు లేకున్నవే ?
భోజనభాజన ♦ పుంజమేల
వల్కలాజినకుశా ♦ వళులు లేకున్నవే ?
కస్తురికకూల సం ♦ ఘంబులేల
కోనకోనివసియింప ♦ గుహలు లేకున్నవే ?
ప్రాసాదసౌధాది ♦ పటలమేల॥

గీ॥ ఫలరసాములఁగురియవే ? ♦ పాదపములు
స్వాదుజలములుండవే ? ♦ సకలనదులు
పొసఁగభిక్షంబు వెట్టరే ? ♦ పుణ్యసతులు
ధనమదాంధులకొలువేలఁ ♦ దాపసులకు॥

విభీషణుఁడు॥ చాలు. చాలు. సంతోషా, నీవంతటివాఁడవే, నీవాక్యంబులు శ్రోత్రామృతంబుగానున్నవి, మీరిఁక శత్రుజయమునకు బయలుదేరుఁడు. విష్ణుభక్తి మహాదేవి ప్రసాదము జయసూచకముగానున్నది (ఇట్లు తెలిపి నిఖిల సేనానికాయంబుల సిద్ధపరచి)

ఉ॥ సాహసకార్యమూనితివి ♦ శాలకృపాభరితాంతరంగమాం
పాహియటన్నవారిభవ ♦ బంధము బాపెడిదేవలోకులకా
ద్రోహమొనర్చినస్తుతిని ♦ ద్రోసెడికృష్ణుని బాపశీలునా
మోహవుజయించుచున్నగన ♦ మోఘవరంబుననుగ్రహింపుమా॥

వ॥ అని యిట్లీశ్వరధ్యానంబుగావించి॥

ష్ఠుంజగ॥ వేయిహయంబులఁగూర్చినరథమున ♦ నెక్కుచుఁదనసేనలతోఁ
బాయకవెలువడినైయాయకునిం ♦ బంచెసంధికైగురితోఁ.

వినకమహామోహుఁడు సేనలతో ♦ వెడలి పెంపు దీపింపఁగ
వసదముగ లెగజిఁరించుచు నప్పుడు ♦ వచ్చె వివేకుని నొంపఁగ॥

వ॥ ఇట్లా కళేబరపురంబున, మహామోహుని సేనలును, వివేకుని సేనలును విడిసి యిరుగెలంకుల నిలిచి వ్యూహంబులఁబన్ని చిత్రవిచిత్రంబుగాఁ బోరుచుండె రట్టియెడ॥

మలయమారుతము--ఆది తాళము.

రణమొనర్చిరి- రాజసైన్యములు ॥రణ॥ పణములెన్నో గూర్చి- బాణములబేర్చి-యణుమాత్రముల-త్యంబు దప్పకుండ ॥రణ॥ ॥౧॥ భద్రనాగముల - పైవసించిలీల - ముద్రలెల్లగూర్చి - ముందుకేగియార్చి ॥రణ॥ ॥౨॥ భయములెల్లగుంది - పటుధైర్యమంది - క్రియలశుద్ధిజేసి - రిపులపై నిద్రోసి ॥రణ॥

అప్పుడు॥

గీ॥ బౌద్ధచార్వాకజైనకా ♦ పాలికాది
యోధులను బంపమోహుఁడా ♦ యుద్ధమందు
వేదవేదాంగఘనపురా ♦ ణాదిసాధ
నముల నొంచెఁగళాదేవి ♦ యమితశక్తి॥

వ॥ అట్టి యామహావీరయుద్ధమునందు వస్తువిచారుండు కాముని నిర్జించె. క్షమాదేవి క్రోధ, పారుష్య, హింసా, దంభా, దులహింసించె. సంతోషుఁడు, లోభుని, తృష్ణను, దైన్యుని, అనృతుని, పైశున్యుని, చౌర్యుని, వధియించె. అనసూయ, మాత్సర్యునింబరిమార్చె. శాంతి యహంకారుంద్రుంచె. వినయుండు మదునిగీటడంచె. పరగుణోత్కర్షుండు - మానునిజయించె. శరీరాత్మవాదులన్యోన్యసైన్యవిమర్దనంబులంగూలిరి. మఱియు మహామోహు

యులగు, సౌగత శాక్తాంతికాదులు వివేకసైనికులయెదుట ని
లువంజాలక దేశాంతరగతులైరి. ఆసమయంబున వివేకుండును
మహామోహుండును పుంఖానుపుంఖంబులుగా బాణంబుల
బ్రయోగించుచుఁ బోరుచుండిరట్టియెడ॥

ఉ॥ కాదలరామరావణుల ♦ కర్ణము ఫల్గునకర్ణయుద్ధముం
గాదల దేవదానవుల ♦ కయ్యమునట్టిది యావివేకథా
త్రీదయితుండు మోహుఁడును ♦ దెంపునఁ బెంపునఁ జేయుయుద్ధము
త్యాదరలీలఁ జూడవల ♦ దా ? నరజన్మము నెత్తినందుకున్॥

సీ॥ తగువివేకబలము ♦ తనబలంబునుగూల్చ
విష్ణుభక్తియిడిన ♦ విద్యవలన
మోహరముననుదాగె ♦ మోహుఁడెచ్చోటనో
చెడ్డనడతయున్నఁ ♦ జేటుగాదె ? ॥

అంత॥

మంజరి॥ మహావీరసంప్రహారమునన ♦ మ్మహామోహుకులమెల్లన్
విహారములుడిగి ప్రహారములఁబడి ♦ విగతప్రాణులుగాఁగ
మనోమహీపతిఘనాశనింబోల్ ♦ తనూభవులగతివినుచున్
అనూనతరముగు మనోవేదనం ♦ బునన్ మిగులవిలపించెన్॥

ఫీలు రాగము—ఆటతాళము.

అయ్యో దైవమయంతో యాపదబెట్టితి - మహాహానిన్నేమం
దును ॥౧॥ కన్నులెన్నోగల్గి గాంచుచుండెడినాదు - కన్నులడచిగ్రు
డ్డిగా జేయదలచితివే ॥౨॥ సంతుగల్గినభాగ్యశాలినను గొనునాదు -
సంతోషమునునీట నెంతలో గలిపితివి ॥౩॥ సుతులదలచుకొనియే డ్చు
టకా నాప్రాణములు - వెతకికైకొనిపోక విడచిపోతివకటా॥

ఉ॥ పోతిరె నన్నిటందిగిచి ♦ పుత్రకులారమతొందుచోటికి

వీతనయోగ్రదుఃఖమున ♦ నింకఁ బ్రవృత్తిఁ గోరెదవు గూలితో
గోతికిఁ బాలుగావలసె ♦ గుమ్మెడుబిడ్డలు గల్గియుండి హా
యీతతివచ్చియెవ్వరును ♦ నేఁడుపుఁదీర్చెడువారు లేరయో॥

వ॥ ఇట్లు మనోమహారాజు శోకింపఁ దచ్ఛోకాపనోదనంబునకై విష్ణుభక్తిచేఁ బంపఁబడి వైరాగ్యం బిట్లనియె॥

వైరాగ్యము॥ తండ్రీ మనోమహారాజ! వగవకుము. నీవేఁడుఁగని దేమున్నది చూడుము।

ఉ॥ కల్పశతంబులాయువును ♦ గాంచినయింద్ర మునీంద్ర సిద్ధసం
కల్పులు బ్రహ్మముఖ్యులు జ ♦ గంబున నెందరో నష్టమైరి యీ
స్వల్పసుఖార్థ్యమౌ జగతిఁ ♦ జచ్చుట పుట్టుట గాక సంతతా
నల్పసుఖంబు గల్గునె జ ♦ నంబులు శాశ్వతజీవనంతులే ? ॥

వ॥ తండ్రీ! స్నేహదోషంబుచే నిట్లు పలవించుచున్నావు. స్నేహమధికమైనకొలఁదిని దుఃఖంబధికమగును; కనుక నే స్నేహము సర్వానర్థమూలకంబని పెద్దలు చెప్పుదురు. వినుము॥

చ॥ కలుఁగకయున్న యప్డయిక ♦ కల్లరటంచొకకొంత దుఃఖముం
గలిగినపైని సత్పుణము ♦ కై కడగాంక్షమహాప్రయాసముల్
వెలఁదులతో సుతార్థ్యులయి ♦ పిమ్మటఁ జచ్చినఁ బెద్దదుఃఖముం
కలుఁగఁగఁ జేయుచుండ్రు సుఖ ♦ కారకులే! సుతులెన్నఁడేనియున్

వ॥ కావున నట్టివారలమరువుము. "అచింతైవమహౌషధం" అని పెద్దలు చెప్ప వినలేదే ? ॥

మనోమహారాజిట్లనియె॥ అయ్యా నీవు చెప్పినది నిజమే, అయినను నన్ను శోకంబు విడువఁజాలదు. వారి నే నెట్లు మరువఁగలను॥

గీ॥ కడుపునందుఁ బుట్టి ♦ కనులముందు బెఱిగి

హృదయమునను నంచ ♦ రించువారి
ముద్దుమాటలఁ గట్టి ♦ ముచ్చటాడెడివారి
మరువఁగలఁడె యెట్టి — ఘనుఁడైన

వైరాగ్యుఁడు॥ తండ్రీ ! నిన్ను మమత్వంబు బాధించుచున్నది, దాని వదలితివేని నీకు సుఖము కలుఁగఁగలదు. చూడుము॥

గీ॥ మనదియనుకున్నచో దుఃఖ ♦ మును ఘటించు
కాదు నదనుకొన సుఖ ♦ కారిగాదు
పాము తినయెద్దఁగఁ గాంచిన ♦ వగచుఁగాని
యొకటి హారలఁ జంపిన ♦ నేడ్చుచున్నె ? ॥

వ॥ మనోమహారాజు—అయ్యో వారునా వారు కాదని పిలువక యెట్లుండఁగలను ?

తోడిరాగము—ఆదితాళము.

ఏలీల బాలుర మరతెద ।ఏలీ॥ ॥౧॥ చాలఁగ విందులు సలిపెడివేళ — లీలలతోఁ బన — లించెడివేళ ॥౨॥ హేలను దావసి యుంచెడివేళ — బాలురఁ బిల్వక ప్రాణములున్నే ? ॥

వైరాగ్యుఁడు. వ॥ తండ్రీ! నీవు వెఱ్ఱివాని వలెను న్నావు, సుతులాడిననేమి ? సంసారమూడిననేమి ? మమకారమూడినచో నెవరెట్లైననేమి ? అప్పుడు దుఃఖమెక్కడిది ? వినుము.

గీ॥ నాదియనుకొంటదుఃఖ సం ♦ పాదిగాని
పుట్టిచచ్చినదుఃఖంబు ♦ పొసఁగ దెపుడు
శిరమున తయు బాధించు ♦ చెడ్డపేనుఁ
బట్టిచంపినదుఃఖమ్ము ♦ బుట్టుచున్నె ? ॥

దర్బారురాగము—ఆటతాళము.

ఏమిసంబంధం బెవ్వరికైన ॥నేమి॥ నేమముతోఁ గన — నిమిత్త

మాత్రమె ॥యే॥ ॥౧॥ వారికివారలె వీరికివీరలె - కారొకరికొకరు క
ష్టసుఖములకు ॥నేమి॥ ॥౨॥ బోటియిల్లుదాటగ-బోయితామరయును-
కాటివరకెనుతుల్-కదలివరలుదురు ॥యేమి॥ ॥౩॥ ఏకతరువుపైన-నే
కపక్షులుగూడి - వేకువరాగానె- వెడలునువేరిక వె ॥యే॥

మం॥ బాటనుగలసినబాటసారులు న ♦ భముననుగలియుమేఘములు
నేటనుగలసినతరులనవచ్చుచు ♦ నేగుచుండ్రుభంగులు
జననీజనకులుబాంధవతనయులు ♦ సకలమైనతనవారు
దనదుకర్మవశులనుచుబుధులెఱిఁగి ♦ తాముశోకముంగొనరు॥

కం॥ ఎందరుసుతులైరో నీ
కెందరుతలిదండ్రులైరొ ♦ యెఱుఁగుదువే ? నీ
వెందరికిసుతుఁడవైతో
డెందమునకుస్థైర్యమిడ బ ♦ లిమి సుఖమిచ్చున్॥

వ॥ కావున స్థిరమనస్కుఁడవై దుఃఖము నడఁచికొనుము॥

మనోమహారాజు. వ॥ అయ్యా, నీవు నాకీయుపాఖ్యానంబునఁ గాను
పించితివి, స్థైర్యముగలిగినచో దుఃఖములేకుండుట నిజమే, నాక
దికలుఁగలేదు. అదికలిగెడియుపాయంబు నెఱిఁగియుంటివేని
నాకనుగ్రహింపుము॥

వైరా॥ అయ్యా, ఇదియతిరహస్యము. అయినను నార్తులకుపదేశిం
చుట దోషముకాదు. నీవిప్పుడుపదేశమునకర్హుఁడవైతి
వి, కావునఁ జెప్పెదవినుము॥

చ॥ స్మితముఖు - సత్కిరీటునత ♦ నీకుసుమాభు - ముకుందునైనసం
గతశశభృత్కిరీటుస్ఫటి ♦ కప్రతికాశుమహేశునైన స
న్మతినిడివేసవిందపన ♦ మాన్చెడిచల్లనినీటిచెలువ్వారు.

ద్గతిఁజనిమున్గినట్లు నిర ♦ తంబునగాంచిసుఖంబుజెందకమా॥

ఇంతియుగాక॥

గీ॥ పాపకర్మలకైనీవన్న ♦ బాధబెట్టి
చచ్చినట్టిసుతులపై వి ♦ చారమేల
నీకసుఖంబబ్బువారి జో ♦ లెత్తకున్న
శాంతముసుబూనుమిఁకనైన ♦ స్వాంతరాజ॥

మనోమహా:—

మంజరి॥ ఆలిబిడ్డలనుసందరిఁగోల్పడి ♦ హాయిగనేనెట్లుండుఁగా
చాలగదుఃఖముఁబొరలకనాకిఁక ♦ శాంతియేపగిదిఁగలుఁగుఁగా
దరియవచ్చినావగపువహ్నియో ♦ దార్చువారెవరుగలరు?
కోమలినమోముగనుంగొనిననుఁ ♦ గూర్చిపలుకువారెవరు?

నైరా॥ అయ్యయ్యో. నీవట్లనుకొనఁదగదు. నిన్ను దేశములపాలుజేయించి యలయించెడి యానీపుత్రాదులు చచ్చిరికాని; నినుఁదిరుగనీక సుఖపెట్టను నీపెద్దభార్యయగు నివృత్తియు జ్యేష్ఠపుత్రుఁడగు వివేకుఁడును మఱియు మేమందరముంగలము. నీవు మమ్మనందరిని పుట్టినతోడనే విడిచితివి. నీకొకవేళ సుఖల దుఃఖము బొరలెనేని నన్ను దలచినమాత్రముననే యుడుగును. తెలిసినవారందరును సుఖకాంక్షులయ్యెదరు, మఱియు గృహస్థుండెప్పుడును తనయాశ్రమపద్ధతిని విడలఁగూడదు. గావున నేను జెప్పినట్లుండి,

చ॥ శమ దమ హర్షముఖ్యబుధ ♦ సంతతతోడ నివృత్తిపత్నితో
యమనియమాదిమంత్రిని చ ♦ యంబులతోజతవీడకెప్పుడుఁగా
శ్రమమొకయింతలేకుపని ♦ మత్సతితోడ వివేకు యావగా
జ్ఞమునను నిల్పుమయ్యవిను ♦ మయ్యచిదాత్మసదాభజింపుమా॥

సలలితసాధనభూతయానాపని ♦ షద్దేవినిరప్పించి
యమనియమాదులశాంతిశ్రద్ధల ♦ ననుకూలలఁగావించెఁ
గ్రమము.గనాదేవికివివేకునకు ♦ ఘటనగలుగఁజేయించెఁ ॥

వ॥ అంతఁ గొన్నిదినంబులు కావిష్ణుభక్తి మహాదేవి, వివేకుని మతి యను గర్భన యగు నుపనిషద్దేవిని వెంటఁబెట్టుకొని జీవునియొద్ద కరిగి యుపనిషద్దేవితో నిట్లనియె॥

విష్ణుభక్తి॥ వ॥ దేవి ! పరమేశ్వరస్వరూపుండగు నీజీవుండు తనస్వరూపమ్ము దానెఱుంగక భ్రాంతుండై యున్నాఁడు, కావున నీతనికిఁ దత్త్వముబోధించి తనసెఱుఁగునట్లు జేయుము అనిన నుపనిషద్దేవి జీవునితో నిట్లనియె॥

కం॥ జీవా ! యాదుర్మార్గుల
సావాసము చేతనుపని ♦ షద్దేవినిన
న్నీవుమరచితివి గావున
నీవేళనువచ్చినార ♦ మొత్రిగించుటకై ॥

వ॥ అనిన జీవుండిట్లనియె. తల్లీ ! నమస్కారము. నేనునిన్నెప్పుడు జూచితిని, ఇన్నాళ్లనుండియు నెక్కడనుంటివి ? చెప్పుము ? ॥

ఉపనిషత్తు॥ వ॥ తండ్రీ ! నీవునన్ను ద్వాపరాంతమువరకు విడువక యేయుంటివి. పిమ్మట కామక్రోధాదుల దుస్సాంగత్యముచే నన్నుఁ గనుఁగొనవైతివి. మహామోహుని ప్రోత్సాహమువలన నన్నెందరెందరో యెన్నెన్నిబాధలో బెట్టిరి, ఆవృత్తాంత మెత్రిఁ గించెద. వినుము

హిందుస్తానీతోడి--ఆటతాళ॥.

వసుధావతినా - బాధలవినుమా ।వసు॥ అసదృశముగనన్ను -

నలయించి రెండవ ॥వసు॥ ౹౧॥ దేవతాన్యములగు-దేవాలయముల-భావము దెలియక - పామరమతులై ॥వసు॥ ॥౨॥ పసులగొడ్లలో - బహుమతములలో - నిష్ఠైనవారునా - హృదయ మెఱుంగక ॥వసు॥ ౩॥ తత్వము నెఱుగక - తప్పుడధర్మములల్లి - సత్వమువిడనాడి - జాలి దేలించిరి ॥వసు॥

వ॥ నేనిట్లు బాధలనొంది యొందిపోవుచుండఁగా విద్యాస్వరూపిణులగు కొందరు సుందరులు గానుపింప వారైన నానిజమెఱుంగకుందురా ! యని వారలదరి జేరి నేనిట్లంటిని సోదరులారా ! ॥

ఒక్కఁడై రెండవవాఁడులేని పరమేశ్వరుని మీరెఱుంగుదురా ?

వ॥ అనియిట్లు నేనడుగఁగా వారెఱుంగకుండుటయేగాక కోపించుచు వారన్నమాటల వినుము॥

సీ॥ కర్మయొక్కండు బో ♦ క్రమటొక్కఁడన్యాన్య
మలవడదని తెల్పె ♦ యజ్ఞవిద్య
యొకఁడాగకుండు వే ♦ టొకఁడు సర్వమునొందు
మటిబాయడనియె మీ ♦ మాంసవిద్య
సత్కర్మమేముక్తి ♦ సాధనంబాత్మవి
జ్ఞానంబుకాదనె ♦ గర్మవిద్య
పరమాణువులె జగ ♦ ద్భవహేతువులు నిమి
త్తంబీశ్వరుండనెఁ ♦ దర్కవిద్య॥

తే॥ ఆత్మమద్వైతమక్రియ ♦ మనియెఱుఁగక
నాదుతెనువెల్లభిన్న భి ♦ న్నములు జేసి
హారముల్ద్రెంపి వెండ్రుకల్ ♦ జీరి యూడ్చి
నలిపినట్టికష్టంబులఁ ♦ దెల్పవశమె॥

వ॥ ఇట్లువస్థలనొందఁ బిదప గీతాదేవి నాయోధాధ్యాఃమొఱఁగి బాధ అంజోనదుప నీవిష్ణుభక్తి మహాదేవిగారి యనుగ్రహంబునతొవ వివేకదర్శనంబుజేసి ధన్యుడై నీబంధముబోనడుచుటకై మేము నీసన్నిధికి వచ్చితిమి గావున॥

సావేరిరాగము--అటతాళము.

తెలియుమా - నీవునీరూపము ॥తెలి॥ ॥౧॥ తెలియుమానీస్వరూపంబును - గలియుమాయీశ్వరునియందున - సలఘుమాయాకృత్యములురూ - పాసులఖిలంబనుచు ; జీవా ॥తెలి॥ ॥౨॥ అలఘుబ్రహ్మేంద్రాదులనునా - యందుగల్పనజేసెమాయా - లలనయసి, కల్పితమునూర్యుని - జలదమట్లుంటదని, జీవా ॥తెలి॥ ॥౩॥ నేనెయీశుడనైతిజ్ఞానా - జ్ఞానములునాకులేవనుకోను - జైననజ్ఞానమా ; నాండౌటయొక్కటిదక్క-జీవా ॥తెలి॥ ॥౪॥ తోయములముగియొగ్గిన - తోయమేపెనగొనెడిగతినా - మాయనినుబెనగొనునుదానిని - బాయుమా ; యద్వయుడవౌమవు ॥తెలి॥ ॥౫॥ ఒక్కటిజ్ఞానరూపముగా - నొక్కతఱిమోహరూపముగా-నొక్కతఱిచిత్రరూపముగా - జిక్కుపెట్టునుమాయ ; జీవా ॥తెలి॥

సంగ్రహవర్ణనం॥ స్వయంప్రకాశుఁడద్వయుండు ♦ స్వేచ్ఛమాయయందుఁ జొ
చ్చియీశుఁడై యవిద్యఁజొచ్చి ♦ జీవరూపమొందిన
ట్టియాత్మమూర్తినైననీకి ♦ డెట్ భుజింపనన్నముల్
జయింపఁగానవిద్యనీవె ♦ శాశ్వతుండవౌదుఁగదె॥

వ॥ జీవా ! నీకామాయాస్వరూపంబుఁ జెప్పెదవినుము॥

మంజరి॥ మాయకర్మరూపిణినినువిడువదు ♦ మానితఁగర్మమునసనినట్
బాయ ; దెపుడుకర్తృత్వంబునువిడు ♦ వనుముజ్ఞానమిడుఁగానట్

జ్ఞానమయుండవీవు గాఁగఁ గర్మముఁ బ్రియముగానెనిసి విడుచుమీ
తానపుంసకుండని తెలిసినచోఁ ♦ దరుణి విడుచు చందమునన్॥

తండ్రీ! జీవా! త్రిగుణాత్మకయగు నామాయ పరమేశ్వరుని దనయందుఁ బ్రతిఫలింపఁజేసికొని వానికి నీశ్వరత్వంబును, రజోగుణమునందుఁ బ్రతిఫలింపఁజేసికొని జీవత్వంబును, తమోగుణంబునఁ బ్రతిఫలింపఁజేసికొని జగంబును, గల్పింపగా నీకాజగంబు భోగ్యపదార్థంబయ్యె. అందుచే నీవు జగద్భోగలోలుండవై కించిజ్జ్ఞత్వంబున నప్పరమేశ్వరుని మఱచితివి. ఈశ్వరుండు సర్వజ్ఞత్వంబున జగద్భోగవిరహితుండై యప్పరమేశ్వరుని గొలుచుచుఁ బరమానందంబు నొందుచుండె. ఏలనన. రజస్తమోగుణరూపంబగు నవిద్య చీఁకటివంటిదిగావునఁ దానిలోఁ జిక్కి నీవా పరమేశ్వరు నెఱుంగక బాధనొందుచుంటివి. సత్వరూపమగు మాయ స్వచ్ఛముగావున నందలి యీశ్వరుఁడు తామరాకునీటియందున్నను నీటినిగలియనియట్లు మాయకులోఁబడక దానివశపఱచుకొని బాధలేకయుండె. ఒకదీపమే రెండద్దములలోఁ బ్రతిఫలించినట్లు మాయుపాధులలోనున్న పరమేశ్వరుఁడొక్కఁడె. కరచరణాదులు మనోబుద్ధ్యహంకారములు నుపాధియనంబడు. అట్టియుపాధియే నేననియనుకొనుట భ్రాంతి. దానినేవిడువవలయు అట్లువిడచుటయే మాయనుజయించుట. భ్రాంతినివిడుచుటయెట్లందువేని ; భోగరూపంబగు జగంబు నసారంబుగానెఱింగి నిత్యానందప్రదానచతురుండగు నీశ్వరునిభజించుచు, నాతనియనుగ్రహంబున జగద్భోగవిముఖుండవై యుపాధియందలి యభిమానంబును విడచి పరిపూర్ణత్వంబు నొందెదవు. అదియే తురీయావస్థ. అదియేసమాధి. అదియేజీవన్ముక్తి. అట్లద్వితీయుండవైతివేని యవాఙ్మనసగోచరమగు నిర్వికల్పకసమాధియగును. అదియే విదేహకైవల్యము. అదియే తురీయాతీతము. అదియే పరమార్థము: ప్రమాణము, "ననిరోధో నచోత్పత్తిర్నబంధో నచసాధకః నముముక్షుర్నవైముక్త ఇత్యేషాపరమార్థతా" ఇట్టిజ్ఞానముగలుఁగుటకు బహుజన్మ పుణ్యఫలజపరిపాకమువలనఁ గలిగిన బ్రహ్మాత్మైక్యస్వరూపముగు దృఢభక్తియే కారణము. వినుమా

౫॥ ఏకలక్ష్యముచేత ♦ నేకదా డెందంబు
డిందంగఁ జేసిరయా ♦ నందపకుటి

యేకలక్ష్యముచేత ♦ నేకదాసదసద్వి
లక్షణమోక్షస్థ ♦ లంబుఁగనుట
యేకలక్ష్యముచేత ♦ నేకదావిజ్ఞాన
రూఢుఁడై ప్రజ్ఞాన ♦ రూపుఁడగుట
యేకలక్ష్యముచేత ♦ నేకదాదివ్యదృ
ష్ట్యాదికాఖిలమహి ♦ మాఢ్యుఁడగుట॥

గీ॥ యేకలక్ష్యంబుచేతనే ♦ యెఱుకఁబడక
తెలియఁదగువస్తుతత్త్వంబుఁ ♦ దెలిసికొనుట
యేకలక్ష్యంబుతోసాటి ♦ నెనయునట్టి
ఘనతరంబగుదివ్యసా ♦ ధనము గలదె ? ॥

వ॥ కావున నీకిట్టిలక్ష్యంబు గుదురుటకై చతుర్వర్గప్రదాతయగు నీశ్వరునినైన భజింపుము. లేక యీశ్వరునకు నిత్యానపాయినియు, దుర్ఘటకార్యకారిణియు, జ్ఞానస్వరూపిణియునగు మాయామహాదేవినైనను భజింపుము. కృతార్థుఁడవయ్యెదవు ఇప్పుడు॥

గీ॥ కామమోహప్రవృత్త్యాది ♦ కలితుఁడగుమ
నామనోరాజు నిట్టట్టు ♦ లలయఁజేసె
నీవివేకనివృత్తుల ♦ నెంచియున్న
నామనోఘూర్ణవడఁడెనీకు ♦ హాయిఁజేయు॥

వ॥ నీయజ్ఞానాంధకారమడంచు నీవివేకమహారాజు చంద్రునెడబాయకుము. మఱియు॥

మంజరి॥ భ్రాంతిచేతభ్రాంతుఁడునుగ్గాని స ♦ ర్పంబనితలఁచినలీలన్
సంతతమును బ్రహ్మస్వరూపమును ♦ జగమనితలఁచెదుచాలన్
కర్మమునఁగల్గినదేహాది వి ♦ కారంబునఁజిక్కియెవ్వన్
నిర్మలరూపంబద్దముచేత న ♦ నేకవిధములగుచాయన్॥

వ॥ మఱియు సగుణేశ్వరుని లక్షణంబులన్నియు నీయందుగలవు చూచుకొనుము॥

సీ॥ జననస్థితిలయంబు ♦ లను వందనీయందె
యుండుటమూఁడెక్ఱ ♦ యుండవీవె
జ్ఞానరూపంబున ♦ సర్వమందుననిండి
కొనుటసర్వవ్యాప ♦ కుండవీవె
సర్వమ్ములీయందు ♦ సర్వమందీవుంట
నాధారమాధేయ ♦ మైతివీవె
యాద్యంతశూన్యకా ♦ లాదులెల్లనెఱింగి
యుంటనాద్యంతశూ ♦ న్యుండవీవె॥

గీ॥ యన్నియుండుటసగుణుఁడ ♦ వైతివీవె
యన్నివదలిననగుణుఁడ ♦ వౌదువీవె
యింద్రియాద్యభిమానంబు ♦ నెల్లవిడువ
సచ్చిదానందరూప సం ♦ గతుఁడవీవె॥

వ॥ అట్లు నిర్గుణుండవౌటకును వెనుకజెప్పిన యేకలక్ష్యమే సాధనము, ఇదియే యమనస్క రాజయోగము.

గీ॥ ఆప్తవాక్యలపణిరజ్జు ♦ నైనకరణి
నాత్మునిస్వరూపమగుసుమీ ♦ యఖిలజగము
శివుఁడవౌదువునిజముగా ♦ జీవనీవు
పరమగురుఁడుపదేశింప ♦ భ్రాంతివదలి॥

వ॥ అందుకునీకుఁ బరిపూర్ణలక్షణంబగు నేకభావన నెరింగిచెదవినుము. అందుచే నీవుకల్పితములగు జీవత్వేశ్వరత్వంబులవిడచి యభేదరూపుండవయ్యెదవు॥

గీ॥ నిఖిలమును నేనెయనిత్యమైన ♦ నిశ్చయింపు
మఖిలమును గానటంచైన ♦ నాత్మనమ్ము
మనుకొనుటగాదు నిక్కము ♦ స్థైర్యవేని
కలఁచుచుండు పునరావృత్తి ♦ గలుఁగదయ్య॥

వ॥ తండ్రీ నీకా పరమేశ్వరుని మాయారహితస్వరూపం బెఱింగించెద లెస్సగవినుము॥

గీ॥ పుట్టిసమసినసంకల్ప ♦ మానకుఁగలుఁగఁ
జోవుదానికినడుమ సం ♦ పూర్ణమగుచు
నెద్దియనుగానరాకుండి ♦ యెసఁగునట్టి
తత్వమెద్దియొపరమేశ ♦ తత్వమదియ॥

వ॥ ఇట్లు దెలిపినన య్యుపనిషద్దేవి ప్రబోధవాక్యంబులఁ బరిశీలించి యనుభవానిరూపంబులగుటచేఁ బరమానందంబునొంది జీవుం డిట్లనియె॥

పూరికళ్యాణి–ఆదితాళము.

తలిదండ్రులారా – దైవములారా ॥తలి॥ చెలిమిమీదుబోధ – చేకృతార్థుడనైతి ॥తలి॥ ॥౧॥ రాగద్వేషాదుల–రంగములడంగె–బాగుగామమత్వ – భ్రమలెల్లగ్రుంగె ॥తలి॥ ॥౨॥ ఘనదారపుత్ర – గ్రాహములుడుల్లె – పనిలముంచుతృష్ణా – వర్తములుజెల్లె ॥తలి॥ పరమఘోరసంసార – వార్ధిఁదాటుటకు–స్థిరవిష్ణుభక్తి – దేవినావయ్యె ॥తలి॥

వ॥ జీవుండిట్లు పలికినఁజని. తండ్రీ, నీకిప్పుడు విద్యానందంబుగలిగెఁగాని యీశ్వరిత్వంబుగలుఁగలేదు, ఏలనన. శిథిలప్రయత్నుండయ్యును నహంకారుండు పడువలేదు, నీకు సర్వబంధంబులఁ గలిగించిన యీమనోమహారాజును శాంతునిజేసి నీవశేపరచితిమి; ఈతండిప్పుడు

నివృత్తిసహితుండయ్యెఁగావున నీకు సుఖకారకుండయ్యెడును, నీకఖండానందము గలిగించెడి మహాత్ముఁడీ వివేక మహారాజుచే న నుగ్రహింపఁబడి నాగర్భంబునున్నాఁడు. ఇకశీఘ్రములో జనింపఁ గలఁడు, తజ్జననంబునకై మమ్ముడబాయకుండి యీశ్వరునారా ధింపుము. అనియిట్లు తెలిపిన నంతవివేకుండు పరమగురుత్వంబు వహించి సంకర్షణవిద్యామహిమంబుచే భ్రాంతిమఱపులను సంకెలలవిడఁదీసిన తత్క్షణంబ॥

మ॥ హృదయగ్రంథివిభేదనుండు బహుసు ♦ శ్లిష్టజ్ఞేయతత్త్వస్థితి
ప్రదుఁడు చ్ఛాంచితకర్మమూలదహన ♦ ప్రారంభుఁడద్వైతసం పరమ
గ్రథనాద్యుండు రసంశయచ్ఛిదుఁడు బ్ర♦హ్మానందుఁడన్ పుత్రకుం
డుదయించెన్ సుఖరూపుఁడద్వయుఁడుదా♦ను దీప్తితో వెల్గుచున్

మంజరి॥ తలఁపనవాఙ్మానసగోచరుఁడా ♦ తనయుండుద్భవమంది
యలజీవునకును సాక్షాత్కరింప ♦ నాతండచ్చెరువంది
యంధకారబంధురభవకూపం ♦ బవుడెవిడఁగ పై కెక్కన్
బంధతనదలినవానిపగిది బ్ర ♦ హ్మానందము నదిఁగ్రుస్కెన్॥

గీ॥ స్థూలముసూక్ష్మతమము ష ♦ డింద్రియములు
జేంనవశంబుసిద్ధాంత ♦ పారమార్థిక
కస్వరూపంబుసిత్యంబ ♦ కలుషమట్టి
చిద్విలాసస్థలముజేరె ♦ జీవుఁడప్పుడు॥

తదనంతరంబ:—

గీ॥ దీపమందునఁగలసెడి ♦ దీపమట్టు
లామహాత్ముండు జీవుని ♦ యందుఁగలియ

పరమసదసద్విలక్షణ ♦ తత్వంబునొంది
యద్వితీయమహాజ్యోతి ♦ యగుచునుండు॥

వ॥ ఇట్లుజీవుండు జీవత్వంబువదలి యనిర్దేశ్య, నిరంజన, నిర్వికల్ప నిత్య, సత్య, శుద్ధ, నిర్వికార, నిరాఖ్యాతుండై, కేవలత్వంబు నొందె నప్పుడు॥

హంసధ్వని రాగము—ఆది తాళము.

ఆనందమానందమానందము - బ్ర॥హ్మానంద॥ ఆనందాతీతమైనదేమియులేదు ॥ఆ॥ ౧॥ లేదు పుణ్యముపాపము - లేదు కర్మమునర్మము - లేదుధ్యానధ్వభానంబులేదు-కేవలమద్వై ॥తానం॥ ॥౨॥ లేదు నామమురూపము - లేదు లేకుండుటయు - లేదుయీశ్వరత్వంబు - లేదుజీవత్వములే ॥దానంద॥

గీ॥ విష్ణుభక్తి మహాదేవి ♦ విమలశక్తి
నంధ్యవేళలదుష్కృతకృత్యుర ♦ డయ్యెశ్రద్ధ
కార్యసాధకయయ్యెవి ♦ కారిమొదలి
జీవుండు శివత్వమొందెన ♦ చిత్రమగుచు॥

మంగళహారతి-సురటరాగము-ఆదితాళము.

ఆనందరూపమున - నానందమొందుచుండు - నానందదాయకునకుమంగళం॥ బ్రహ్మానందదాయకునకుమంగళం॥ సర్వముతానెయగుచు - సర్వమ్మునిండియుండు - సర్వాంతర్యామికిదెమంగళం - ॥బ్రహ్మానంద॥ సదసద్విలక్షణుండౌ - సచ్చిదానందఘనుడౌ - సాంబసద్గురుశివునకుమంగళం ॥బ్రహ్మానంద॥

కకును జేయజాల రెంతపతితులున్॥ క॥ కలియుగమం దొదవిన జీవుల యఘముల దూల్పజాలవు తపోయజ్ఞం। బులు దానవ్రతధర్మము। లల పావనరామనామ మణచు ధ్రువముగాన్॥ గీ॥ బ్రహ్మహత్యాప్రభృతి మహాపాపతతుల। బాపుటకు రామనామజపంబుకన్న। నరయ వేరొక్కటగు నుపాయంబు లేదు। సత్యమిది సత్యమిది పునస్సత్యమనిన॥ చ॥ విలసిత మోద మొప్ప నలవేదధరుం డనె నోమహాత్మ త। త్కలియుగ ఘోరరీతులు కృతప్రభృతి త్రియుగస్వరూపరీ। తులు వినగా మదింగడు కుతూహలమయ్యెడు సంగ్రహంబునం। దెలుపగదే సుధాసమవధీరణపాటవచాటువాక్తతిన్॥ క॥ అని వేడిన నమ్ముని యిట్లనె విను మోవిప్ర మునుకృతాది త్రియుగాం। చనరీతి దెల్పియంతట। వినుపింతుం గలియుగంబు విధముం దెలియన్॥ సీ॥ బొదలును మొదలును తుదియును లేక ప్రపంచమజ్జగమున బరగుచుండు। కాలంబు తత్కాలగతికి కృతాదియుగములు నాలుగు నాహ్వయములు నూవె। ఘనతద్యుగచతుష్కమునను గృతయుగంబు కేవలసత్వగుణావహంబు। భూసురుం డయ్యుగంబున కధిపతి ధర్మ మందు నిర్మలచతురంఘ్రియుతము॥ వినుము తత్పదసంజ్ఞాదివిధము దయయు। దపము సత్యంబు దానముం దత్పదంబు। లవియ వేర్వేర నాల్గుపాళ్ళై యొకొక్క। పదమున దయాదికాంశము ల్పొదువదనరె॥ శా॥ తత్కాలీన ధరామరుల్ వరతపస్తృప్తుల్ పవిత్రాత్ముల్ మహా। తత్త్వార్థాభిమతుల్ కృతక్రతుతతుల్ దాంతుల్ ప్రశాంతుల్ రమే। ట్పత్కంజాత సమర్చనాభిరతు లభ్యస్తాగమవ్రాతు లుద్యత్కర్మస్థిర తాంచితుల్ కృతులు మేధావుల్ స్ఫురద్భావులున్॥ క॥ క్షత్త్రియముఖత్రివర్ణులు। పాత్రవితీర్ణులు వితీర్ణభవసింధులు బం। ధుత్రాత లఘుప్రతతిల। విత్రసుత్రత పతితహారిపవిత్ర చరిత్రుల్॥ క॥ పతిపాదనిరతసేవా। రతులు యశోభారతులు విలాసగుణగతుల్। సతు లతులభాగ్యజలజవ। సతు లతిసౌభాగ్య విజితసతు లఖిలసతుల్॥ వ॥ విను మింక త్రేతాయుగంబు క్షత్త్రియుండు నిజాధినాథుండై యుండ సత్వమిశ్రిత రజోగుణసంకలితంబై చెలంగు నం దన్యోన్యమిళిత హింసానాచారానృతలోభ సంజ్ఞికాధర్మపాదచతుష్క తుర్యాంశంబులచే బూర్వయుగోక్త ధర్మపాదతుర్యాంశంబు లవఘాతంబు లగుటం జేసి ధర్మపాదత్రయంబున ధర్మైకపాదం

బునుం గల్గి ధర్మ్మవుప్రవర్తించు నందలి వర్ణచతుష్టయంబు తెఱం గెఱింగిం చెద నాకర్ణింపుము॥ సీ॥ బ్రాహ్మణుల్ నైగమవాగమలాగమ భాగభాగురు యోగయోగరతులు। క్షత్రియు లౌదార్య సౌకర్యగాంభీర్య ధైర్యవీర్యస్థైర్య శౌర్యకలితు। లార్యులార్యావార్యవర్యచర్యాసక్తపర్యాది పర్యాప్త కార్యకృతులు। పదజు లుదీర్ణ త్రివర్ణ సేవాచ్యుత వర్ణనాకర్ణనా కీర్ణమతులు॥ వీరు వారన నేల తత్సారయుగము। నందు దగులోకులందరు సుందరారా। విందనయనాంఘ్రిపూజాభివందనాద్య। మందచరితులు సంతతానందయుతులు॥ వ॥ మరియు ద్వాపరయుగంబు వైశ్యుం డధిపతియై యుండ దమోమిశ్రిత రజోగుణాత్మికంబై వెలయు నందు హింసాదిసంజ్ఞికాధర్మపాదార్ధాంశంబులచే దయాదిసంజ్ఞికధర్మపాదార్ధాంశంబు లవఘాతంబు లగుటం జేసి ధర్మపాదద్వయంబు నధర్మపాదద్వయంబునుంగల్గి ధర్మ్మవు బ్రవర్తించు నయ్యుగంబునంగల్గు జనులు శాంతిక్రోధమిశ్రితాత్మ్మలును జ్ఞానాజ్ఞానమేళన కించిత్కలుషీకృతాశయులు నయ్యు బూర్వయుగానుసరణ బలంబున బాహుళ్యంబుగా సుగుణవంతులై చెలంగెదరు వారలవిధం బాకర్ణింపుము॥ మ॥ విలసన్నిత్యదయుల్ జితేంద్రియులు గోవిందాంఘ్రి పంకేజభ। క్తులు సత్యవ్రతసక్తు లుత్తమచరితుల్ వర్ధితాన్యోన్య మై। త్రులు సత్కీర్తిధనుల్ కులీనులు సమర్ధుల్ సాధితార్థుల్ వదా। న్యులు ధన్యుల్ సుగుణాకరుల్ నిజకులానుష్ఠాన నిష్ఠాపరుల్॥ గీ॥ కలియుగం బికవినుము కేవలతమోమ। యంబు శూద్రాధిపతి సంయుతంబు నందు। ధర్మరూపైకపాద మధర్మమయప। దత్రయంబును గలుగంగ ధర్మ్మ వమరు॥ క॥ కలుషైకభాజనంబగు। కలియుగమున బొడముజనులు గావించునఘం। బులనెల్ల జెప్పశక్యమె। తెలిపెద నొకకొన్ని వినుము తేటపడంగన్॥ గీ॥ ఒక్క బ్రాహ్మణవర్ణంబె యుండు నదియు। సరవి నాభాసవృత్తిచే బరగు నితర। వర్ణములు సంకరంబులై వసుధ నమరు। దాదృశము లాశ్రమంబులు తద్యుగమున॥ గీ॥ వేషమాత్రంబుచే గాని విధులవలన। గారు నిక్కముగా బ్రహ్మచారులుం గృ। హస్థులును యతులును నాశ్రమస్థులెల్ల। లేదు మూడవయాశ్రమ మాదినముల॥ క॥ జాతారోగ్యుడు వైద్యున। ధీతాగము నిగము డాత్మదేశికుని సుతా। స్వీతపతి యువతిసంగతి ప।రీతుడు మాతను తి

రస్కరింతురు రిపులై॥ సీ॥ అన్నదమ్ముల దండ్రినైన వీడ్కొన నోడరాం
డు చిత్తము దేర్పనలవిగాక। ప్రియులును మీరి వర్తించుచో దల్లులనైన
నొంతురు నేర మరయబోక। ప్రాణాంతములగు కార్యములైన జేతురు ప్రే
యసుల్గోరిన భీతిలేక। నభ్యాగతులు యజ్వులైన దీబోరు కవాల మింతుల
మాట దాటరాక॥ బంధువులకన్న నిష్టదైవంబుకన్న। ప్రాణములకన్న
స్వర్గవైభవముకన్న। నధికము కళత్రసంగంబె యని నటింతు। రంగనాజితు
లగుచు గృహస్థులందు॥ మ॥ అనృతంబన్న జలింతురా ఖలధనంబైనన్
విసర్జింతురా। కణముం ధర్మమొనర్తురా హరిపురాగాథల్ వినన్నేర్తురా।
మనువేదైన జపింతురా గురుల సన్మానించి పూజింతురా। వినయంబొప్ప
చరింతురా యొరుసిరుల్ వీక్షించి సైరింతురా॥ సీ॥ కామాద్యరి జయంబు
గగనారవిందంబు న్యాయప్రవృత్తి వంధ్యాప్రసూతి। యష్టాంగయోగ
విద్య శశవిషాణంబు జ్ఞానోదయము మరుస్థల జలంబు। సాధుసాధన చతు
ష్టయవిభవముమాయ హరిపదభక్తి శుక్తి రజితంబు। సత్యవ్రతంబు కోశా
తకీఘృతము సత్కీర్తి సంపద లవకేశఫలము॥ లకట యక్కలికాలంబునం
దు జనితు। లగు మనుష్యులకెల్ల నిప్పగిదిసూవె। లోభమోహాదిక గ్రస్తు
లున్నతాంత। దుష్టులగువారికెట్లు సద్బుద్ధులబ్బు॥ క॥ తగ జదువుట చెప్పు
టల। య్యుగవిప్రుల కుండ పెచటనో యున్న నిజం। బుగ నాత్మజీవనార్థ
మ। యుఃసగాని పరోపకృతికి ననరాదు కలిన్॥ సీ॥ స్నానసంధ్యా ద్యను
ష్ఠానముల్ డించి శ్రౌతస్మార్త ముఖ్యకృత్యము త్యజించి। దేవపూజా వైశ్వ
దేవముల్ వర్జించి బలిహరణక్రియల్ పరిహరించి। జపతపస్స్వాధ్యాయసక్తి
చాలించి దర్శశ్రాద్ధవిధి యుపసంహరించి। యాగయోగక్రియా త్యాగం
బు గావించి నిత్యాగ్నిహోత్ర శాంతియొనరించి॥ సతతశిశ్నోదర పరా
యణత వహించి। దంభమాయానృతాసూయల భరించి। ఘూర్యహంకార
మమకారములను మించి। పారులుండెద రిహపరభయ ముడంచి॥ వ॥ మరి
యు నక్కలిజనుల చర్యావిశేషంబులు వినుము॥ సీ॥ శ్రోద్ధ సంతతధనార్జ
నమునందునకాని వేదోక్త విధులందు బాదుకొనదు। భక్తి నిజస్తోత్రపరుల
యందునకాని హరిపాదపద్మములం దమరదు। యత్న మన్యవధూరతాస్త్తి
యందునకాని పుణ్యలోకద కర్మముల వెలయదు। భయము ధనప్రాణభం

గమందునగాని బ్రహ్మహత్యాదులపై బరగదు ॥ సతతమై ముఖ్య మతిథి పూజయెడగాని। తారసిలినట్టి పరకాంతదరి నొదవదు। పటువచోధృతి పర నిందపట్లగాని। బహుళహరినామములు పల్కపట్లచొరదు॥ క॥ సాధింపరు సద్విద్యల। బోధింపరధీతమాత్రమును శిష్యుల కారాధింపరు శ్రీహరి పరి। శోధింప రనాదిపూరుషు పురాణకథల్ ॥ క॥ శ్రుతిమద్గానమునకువలె। శ్రుతిస్వరస్వనమువినగ శ్రుతియొసగరయో। కృతులుం బంచమహాదు। ష్కృతిహానముగా రమేశు గీర్తింపరొగిన్ ॥ క॥ కూడరుగా సాధులతో। వేడరుగా బ్రోవుమనుచు విష్ణుని మదిలో। నోడరుగా నిందకు విడ। నాడరుగా దుష్ప్రతిగ్రహం బని కణమున్ ॥ క॥ బాయరు గృహమెన్నటికిని। డాయరు హరిమందిరము స్ఫుటస్వర మొప్పన్। మోయరు హరె హరేయని। సేయరు తత్పాదములకు చెలగి బహునతుల్ ॥ క॥ నానరు పుణ్యనదీతతి। మానరు పితృసహజులం దమానరుష వెసన్। బూనరు వైరాగ్యము తుది। గానరు శ్రీరామనామ గానరుచి కదుర్ ॥ క॥ హా రసన కలిగినందుకు। మారాడక రామకృష్ణమాధవవిష్ణో। నారాయణయని పల్కరు। కారులు ప్రేలె దరు రిత్తగా గలి మనుజుల్ ॥ క॥ పుంభావధారి దైన్య ము। నన్ భీతివివర్ణతా ప్రిణమ్రితలన్ కు। క్షింభరులై నిరతంబున్। కుంభిని దిరిగెదరు యాచకులు భృత్యులునై ॥ క॥ దానంబత్యాగ్రిం బే। కానీతద్దాతనీచకర్మకులుండే। కానీ దేయంబల్పమె। కానీ మదిరోసి చనరు గైకొనక ద్విజుల్ ॥ క॥ కటువాక్కులకు సహింపుచు। జటువులగొల్చెదరు తత్ప్రసాదభవము దు। ర్కటులై భటులై యెంతయు। విటాఘుటకులగుచు భూమివిభులను విప్రుల్ ॥ క॥ ఘనమగు మానము ప్రాణం। బును స్వర్గంబు నపవర్గమున్ ధనమె యటం। చును దాని నొసగుచండా। లుని నైనం గొలుతు రాత్మరోయక ద్విజుల్ ॥ క॥ ఆశాపాశార్తులు బహు। శాశా దేశాంతరార్జితాల్పధను లురు। క్లేశావేశాతిక్రశుల్। నాశిత ధీశాంతి ముఖగుణవ్రజులు ద్విజుల్ ॥ ఉ॥ ఆరయగా నొకొక్కయెడ యజ్వలు వేదవిధుల్ బుధుల్ సదా। చారయుతుల్ తపోధికులు శాంతులు సత్వగుణాఢ్యు లేకప। త్నీరతులున్ శ్రుతిస్మృతివిధిజ్ఞు లదంభులు సూనృతవ్రతో। దారులు నుండ వారల నధఃకృతి జేతు రసూయచే ఖలుల్ ॥ సీ॥ నిజధూమతమము మందీభూతముగ జేయ నోప

కుండియు గృహదీపమాత్మ। కాంతిచే గేహసంగతతమ మణగించుజాడ న క్కలియుగబాడబులును। తారుతరింపగా దక్షతగనకయు దమ్ము పూజిం పుచు దనుపువారి। తరియింపగా జేయ దక్షులై పొల్చెద రిం దొకింతయు లేదు సందియంబు॥ మది నిదిమెరుంగలేక దుర్మదము బొదల। కలిజనము లాద్విజన్ముల గాంచి నగుచు। నందరికి మేనుచెక్కిన నస్త్రమెకద। వీరి యు రువేమటంచు గర్వించి తెగడు॥ వ॥ వెండియు నయ్యుగచర్యావిశేషం బా కర్ణింపుము॥ క॥ భటమయము వేష మరుణిత। పటమయము జనంబు గ్రా మపల్లీపురముల్। విటమయములు పరిహాసక। నటమయ మాశ్రితచయం బు నరపాలసభన్॥ క॥ అణుమయములు ధాన్యంబులు। కణమయమీవి యనపేత ఖచరాదిమహా।రుణమయ మాశ్రిమ మురుభా। వ్రణమయము స మస్తశాస్త్రసంపత్తి కలిన్॥ క॥ కులమును రూపము శీలము। వలదీడును వలదుశ్రుతము వలదననేలా। వలసినయంత ధనంబిడ। గలయాతడె పాత్రి మరయ గన్నియనొసగన్॥ క॥ పల్లవముఖదర్శనమున। బల్లవితము పుష్పి తంబు ఫలితమునై రం। జిల్లు వనితాలతాత్మ స్వ। వల్లభసంగతినిగాంచు వగ్రిహసమతన్॥ సీ॥ కనక మల్పం బలంకారము లెక్కగా కొదవవన్ని యలచే బొదలువారు। కపటంపువలపుచే గరగించి ప్రియుల కన్మొరగి పుం శ్చలులయి బరగువార। లర్థయౌవనహీను లయిన భర్తల బాసి ధనికుల ద రుణుల దగులువారు। ధవులనుమీరి బాంధవుల గేరి భయంబుదొరగి విచ్చ లవిడి దిరుగువారు॥ మగల బావల నత్తమామల నెదిర్చి। బెలుచ నోటికొ లందిని బేర్లువారు। లోకులకు మంచిచూపి లోలోన బతుల। హాతులగా వించువారలు నతివలందు॥ క॥ మదవతు లెన్మిదితొమ్మిది। పదియేడుల కే టయేట ప్రజలం గనుచున్। బొద లెద రాయుర్మానము। పదియారే ళ్లిట్లు చరమపాదగతకలిన్॥ క॥ దుష్కర్మరతులు గోఘ్నులు। నిష్కరుణులు గ ర్వితులును నిష్ఠురమతులౌ। ముష్కరనిషాద హూణతు। రష్కలు త త్త్వాయులున్ ధరాపతులు కలిన్॥ క॥ రాగద్వేషావిలమతు।లాగఃపరిధీక్ష ణామితాసక్తియుతుల్। భోగానుభవైకరతులు।త్యాగరహితు లవని దయి తు లక్కలివేళన్॥ సీ॥ అగ్రహారములు బ్రాహ్మణుల కీ రననేల నాద్యులి చ్చినభూము లాక్రమింప। శ్రితబుధులను బహూకృతి దన్పరననేల బలుమ

రు నెపమెంచి పరిభవింప। బ్రజలకా పరబాధ బాపబోరననేల తమరె తన్ని
త్యబాధకులుగాగ। జనుల నీతినటింప శాసింపరననేల తారె యన్యాయవ
ర్తనులుగాగ॥ దత్కలియుగంబునందలి ధారుణీశు। లమితకోపులు కా
మాంధు లనిశలుబ్ధు। లతికఠినచిత్తు లలసు లత్యంతమూఢు। లనుచితప్రియ
కరు లనభ్యస్తనయులు॥ సీ॥ న్యాయవర్తుల వినష్టార్థుల జేతు రన్యాయవర్తుల
చే ధనంబు బడసి। స్వాధికప్రభుల కర్థాదు లిచ్చి ప్రభుత్వ మెనసికొందురు
లోకధనము బల్మి। నిర్దోషులైన ధనికులపై నెపము సంస్థాపించికొందురు త
ద్ధనంబు। చోరుల నర్పించువారినే బాధింతురు తచ్చోరహృతధనార్థము గ్ర
హించి॥ ప్రభువు లన్యాయసంప్రాప్తవిభవులగుచు। నహరహర్వృద్ధగర్వ
ధూర్వహాతమించి। శమహృదైహికనశ్వరైశ్వర్య సుఖమె। శాశ్వతమటంచు
నెంతయు విశ్వసించి॥ క॥ పలుకుల విశ్వాసరసం। బొలుకహరించెదరు వై
శ్యు లొరులధనంబుల్। కొలచే వాక్కౌశలరీ। తులచే గణనాభిధాస్థితుల
చేతులచే॥ క॥ భూసురులబోలె శూద్రులు। భాసురగతి ధర్మశాస్త్రభావా
ర్థోప। న్యాసంబొనర్చి జనులను। శాసింతురు మీర లిట్లు సల్పుడటంచున్॥
క॥ ఇట్లై సమస్తపాపౌ। ఘమ్ములకిట్లైన కలియుగమ్మున నెమ్మిన్। నమ్మి
పఠియించుజనుల యు। ఘమ్ముల జిహ్మంగగల దొకటె సాధనమై॥ వ॥ అ
ట్టి దివ్యసాధనం బెద్దియంటేని దెల్పెద నాకర్ణింపుము॥ సీ॥ స్వజపద్వరుల
కు మోక్షరమాస్వకన్యలం గూర్పగానెద్ది కూకుదవతంస। మార్యామహే
శజిహ్వారంగముల కెద్ది పటునిరంతరనటన్నటవరంబు। వాల్మీకి పూర్వభూ
ర్వహనిషాదత్వతమంబు జిమ్మగ నెద్దియంబరమణి। బంధురత్రిజగతీపంకసం
క్షాళనక్రియ కెద్ది త్రిపథగోర్మిప్రసార॥ మెద్ది గుడమధు శర్కరామృతరసము
ల। కన్న మాధుర్యమై వన్నెగాంచె నెద్ది। తారకఖ్యాతిచే నెన్నదగియె నె
ద్ది। మహితతద్దివ్యరామనామంబెసువ్వె॥ క॥ ఆరామనామమాతత। ఘో
రామయ శాంతికర మకుంఠతరాంహో। భారామానత మోరవి। సారా
మల సౌఖ్యదం బసదృశము భృశమున్॥ గీ॥ అట్టి శ్రీరామనామ మంత్రా
మృతంబు। దినము గ్రోలుచు తనవిగాంచని మహాత్ము। లమరు వైభ
వతాపపంకముల నొకట। బాసికాంతురు మోక్షసంపత్సుఖంబు॥ గీ॥ కృత
యుగంబున దశవర్షకృతతపంబు। త్రేతయందున నేకాబ్దతీక్ష్ణతపము। ద్వా

పరయుగంబునన్ మాసతప్తతపము। కలి నహోరాత్రి కృతము నేకఫల
దములు॥ క॥ కనగ గలి నెన్న రామా। యనుమాత్రనె ముక్తిగాంతు రం
దు మనుజులం। గనయురువు శూద్రురువు మ।గని సేవ త్రివర్ణ సేవగాంతు
రు ముక్తిన్॥ చ॥ సులభముగాఁగ మోక్ష మిటు జూరగొనందగు వేళ యైన
యె। కలియుగమందు మానుషతఁ గల్గ జనించియు రామనామ మిం।పలర
బఠించకుండునత డయ్యయొ మోక్షము నొందఁగా మదిన్। దలచడికన్ యు
గోద్యతశతంబులకబ్బదు ముక్తి వానికిన్॥ శా॥ ఆకర్ణించితి నేకదా కలియు
గవ్యాపారమున్ రామమం। త్రైక శ్రేష్ఠతయున్ ముదం బెనయ నీ పేరా
మమంత్రామృతం। బాకంఠంబుగ గ్రోలుచుండు మనయం బాసక్తి రెట్టింప
వే। వే కైవల్యపదంబు గాంతువన నవ్వేపుండు సానందుఁడై॥ క॥ ఓ ముని
వర భవదీయ ద। యామానం బెన్న శక్యమగునా పటుమా। యామూఢ
ము దుఃఖితమగు। నా మది సానందముగ నొనర్చితివిటులన్॥ క॥ ఉత్తమక
టాక్షవీక్షన్। చిత్తజదుర్భ్రాంతిదూలిచితివి పటుతమో। భేత్తవయితి గన
మాళ్యా। దత్తాత్రేయుండవీవు దత్తాత్రేయా॥ వ॥ అని మరియున్ బహు
విధంబుల సన్నుతించినం గరుణించి శ్రీవత్సలాంఛనాంశంబగు నమ్మునివ
తంసం బాదరరసంబు ప్రసరింప నిట్లను నో వేదధరా నీకిట్లు దేహాత్మ
భ్రాంతి పరిహారంబును స్వస్వరూపజ్ఞానంబును గల్గుటకు శ్రీరామమంత్రా
నుష్ఠానంబు సూవె ప్రధానసాధనం బయ్యె మదుపదిష్ట మహావాక్యార్థంబు
ను జీవబ్రహ్మంబుల కభేదంబనియు నీవతద్గ్రంథంబనియుంగదా చెప్పితి
మరియు నాకర్ణింపుము రామబ్రహ్మశబ్దంబులకు శబ్దభేదంబె కాని యర్థభే
దంబు లేమిం జేసి బ్రహ్మంబవీవయితివనుట రామత్వం బొందితివనుటయె
సూవె యిట్లు రామత్వం బొందుటకు రామమంత్రానుష్ఠానం బెకాక తది
తరంబు సాధనంబగుటెట్లు మరియు నాలింపుము దేహరక్షణంబులగు న
నృతజడత్వదుఃఖంబుల కాత్మలక్షణంబులగు సత్యజ్ఞానానందంబుల కత్యం
తవిరోధంబులగుటచే నయ్యనృతజడత్వ దుఃఖంబులం గ్రమంబున తత్సత్య
జ్ఞానానందంబులు సమూలంబుగా బరిహరించు నంత సత్యజ్ఞానానందస్వ
రూపబ్రహ్మంబే తానని యెడు దృఢానుభవంబు గల్గు నుత్తమజ్ఞాని కనృత
జడత్వదుఃఖమయదేహాత్మభ్రాంతి నిశ్శేషంబుగా దూరీకృతం బగునప్పు

ద్మహాత్మ్యమందు తత్సత్యాదిలక్షణస్వరూపరామతాదాత్మ్యంబొంది నిరతి శయానందసందీపితుండగుచు నుండు నట్లు కావున నీవు రామత్వప్రాప్తికి ముఖ్యకారణంబగు రామమంత్రానుష్ఠానంబు విడువకుము జీవన్ముక్తుండ వయ్యెదవని తెల్పి మరియు నుపదేశింపవలయు రహస్యంబు లన్నియు ను పదేశించి యమ్మునీందుండు నిజేచ్ఛం జనియె నంత నవ్వేదధరుండును గు రూక్త ప్రకారంబున దన్మంత్రానుష్ఠానతత్పరుండై జీవన్ముక్తుం డయ్యె న ని తద్వృత్తాంతంబంతయు శ్రీరామభద్రుండు సౌభాత్రింబు నెరయ సౌమి త్రితో దెల్పిన నతండు సంతుష్టాంతరంగుండై దత్తాత్రేయనిష్కారణక రుణాపరిభావంబునకు నవ్వేదధరుని యదృష్టంబునకు నద్భుతం బొందుచు నిజాగ్రజునితో ని ట్లనియె॥ గీ॥ అహహా యవ్వేదధరు పురాభ్యస్త పుణ్య। వైభవం బెట్టిదొక్కొ ధన్వంతరియన। మౌనియటువచ్చి తద్భవామయము వాయ। నెలమి జ్ఞానామృతౌషధ మిచ్చి చనియె॥ క॥ అక్కట జీవన్ముక్తి య। దెక్కడ యాబ్రహ్మబంధు డెక్కడ మూలం। బిక్కథ కరయగ రెండ వ। ముక్కంటియనం దనచ్చు మునికృపకానన్॥ వ॥ అని యాసౌమిత్రి వాయుపుత్రుండునుం దానునుం దత్కథాపరిధాన రామనామమహిమాతి శయంబును మునిపరిభావంబును బహువిధంబుల సారెసారెకుం గొనియా డుచుండె॥ చ॥ రుచిరము పావనంబు భవరోగరసాయనసంజ్ఞకంబు నౌ। యచలశుభప్రదైత దితిహాసము భక్తిలిఖించి యాలకిం। చి చదివి లోకు లొందెద రశేషశుభంబు లరోగకారితా। రుచిరశరీరసౌఖ్యము నలోలత రైక వివేకభూతియున్॥ క॥ అనిశంభుడు శాంభవికి। న్వినిచెననుచు రామ హర్షణి ప్రియంబున దెల్పిన శౌనకాదులవ్వలి। ఘనకథ దెల్పుమని వేడు కన్ వేడుటయున్॥ క॥ సాచితముఖపూత్కారరర। సాచితమురళీస్వర స్వనానుస్మృతవిలా। సా చితలాసదీప్తా। సాచివ్యపీతసవ్యసాచివ్యాప్తా॥ మ॥ రమణీమోహగభీరతాదిగుణపారావార రాహీరపా। త్యమరద్వేష్య

సువాయుపాయిశరసర్వాపార పాపారతా । ర్యనుపౌత్రాశయపూరకా
రససేకాసారకాసార రా । హనుముఖపోద్గతచంద్రసూర్యవిధిశంభూదా
భూదారపా॥ మాలిని॥ హరిహయసుత మోదార్ధ్యాదరాత్తప్రతోదా। ప
రపరిభవఖేదా పావనాస్త్రప్రభేదా। వరబుధనుతివాదాస్వాదనోద్యద్వినో
దా। హరిముఖసవనాదాహ్లాదనాత్మప్రసాదా॥

గద్యము॥ ఇది శ్రీమదాశ్వలాయనసూత్రాత్రేయసగోత్రపవిత్ర శ్రీమదాకుండివంశార్ణవపూర్ణిమాత్రేయ సూరిజనగేయ శ్రీ మజ్జగన్నాథనామధేయ విద్వత్సుల బుధవితతిహిత శ్రీరామభద్రకృపారసాపాదిత ఘనకవితాచంద్రికా కళానిధాన శ్రీవేంకటాభిధానప్రణీతం బయిన సుందరకాండము.

సంపూర్ణము.

